


# దేవిలో పువ్వు

కె.అశోక్‌కుమార్
ఇ.వి.వి.సత్యనారాయణ

JAGATI Rs. 2-00 May 1990

35th Year of Publication




## మే - 1990

### సాహితీ సుధ

ఘనకలికించిత ప్రచుర కాంతలు చెంత బికాంగనా కల
స్వనములు వీనులందు సుమశాలి నికుంజము పుష్పమాల్యముల్
వినుత కవిప్రసంగమును వెన్నెల తేటలు భాగ్యవంతులౌ
జనులకు చైత్రమాసమున సౌఖ్య మొనర్చు సుగంధి తోయముల్

—భర్తృహరి



చిదిమిన బొల్లారు చెక్కుటద్దములపై - జిలిబిలి చిరునవ్వు లొలయువాడు
కాళ్ళగజ్జలు గల్లు గల్లు మనంగ నం - దరి కనుల్ చల్లగా దిరుగువాడు
బుడి బుడి నుడువుల బూర్వ భూపాల గా - థల నేను గుడుచు బో బలుకువాడు
రాఘవా, ముద్దియరా, యన్న నెగిరి గం - తిడుచు హాయిగ గౌగిలించువాడ
నట్టి పదునాలుగేడుల బొట్టె నెట్టు - లసుర భీకర వనసీమ కంపువాడ
ననుచు నేడ్చితి నెప్పుడో యపుడు ;మఱల - నిపుడు నీ మూలమున నిట్టు లేడ్చు
చుంటి

—పామగంటి

'జ గ తి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600004
ఫోన్ : 76697-చందా 2 సం॥లకు రు. 45-00 - 5 సం॥లకు రు. 100-00-జీవిత
చందా రు. 300 00. పాట్రన్ - రు. 1000-00. విదేశాలకు 2 సం॥లకు రు.100-00

ముఖచిత్రం : కె. బాలచందర్

# నిమ్మతొనలు

మా ! అమ్మాయి లవ్వూ గివ్వూ [illegible] అంటూ ఎవరో కుర్రాడి వెంట సినిమాలకి, పార్కులకి తెగతిరుగుతోందోయ్ ! 'ఆ కుర్రాడెవడో పట్టుకు బుద్ధి చెప్పాలి' – అన్నాడు రామానుజమ్, సీతారామయ్యతో.

'మీ అమ్మాయిని మందలించక పోయావా ?'

'నాన్నా, నాగురించి నాకు తెలుసు – నువు కల్పించుకోకు – అంటూ నా మాట కొట్టేస్తుంది. నా కూతురెప్పుడూ హద్దుమీరి ప్రవర్తించదు – అని వత్తాసు పలుకుతుంది మా ఆవిడ' – అంటూ వాపోయాడు రామానుజమ్.

'ఇంతకీ ఆ అబ్బాయి అడ్రస్ తెలుసుకున్నావా ?'

'అతికష్టం మీద మా ఆవిడ ద్వారా తెలుసుకున్నాను – వాళ్ల యిల్లు వెంకటాద్రి వీధిలోనని !'

'అయితే, మా వీధే' – అన్నాడు సీతారామయ్య. 'నెంబరూ ?'

'పధ్నాలుగు'

'మా నెంబరే' అనబోయిన సీతారామయ్య, నోటమాట రాక, వెర్రి చూపులు చూశాడు.

—జి రామ<br>నందిగామ

సినిమాకు ఎప్పుడు బయలుదేరినా, రామారావు ఒక పెట్టె చేత బుచ్చుకు రావటం గోపాలానికి వింతగా తోచేది. ఉండబట్టలేక ఒక రోజున 'అందులో ఏముంటుంది ?' అని అడిగాడు గోపాలం.

'ముందు జాగర్త'

'అంటే ?'

'ఫస్ట్ ఎయిడ్‌బాక్స్'

'సినిమాకి వెళ్తూ ఫస్ట్ ఎయిడ్ బాక్స్ ఎందుకు ? ఒక వేళ సినిమా హాలు అంటుకుంటే, ఫైర్ ఎక్స్‌టింగ్విషర్ కావాలిగాని ఈ ఫస్ట్ ఎయిడ్ బాక్స్ మనని కాపాడుతుందా ?' అని ప్రశ్నించాడు గోపాలం.

'ముందు జాగర్త అని చెప్పాను కదా – ఈ రోజుల్లో స్టంట్ సీనులు లేని సినిమా ఉంటుందా, ఉండదు. టివిలో గుర్రప్పందానికి, తింటున్న బటాణీలు ఆపి, కుర్చీలో నిలబడటం మనం చూస్తున్నామే, అలాగే అంత పెద్ద తెరమీద స్టంట్ సీనులు వచ్చినప్పుడు, ఉద్రేకం కలగడం సహజం'

'అలాగని పక్కవారి మీద చేయి చేసుకుంటావా – పళ్లూడ గొడతారు.'

'నేను చెప్పేది సరిగా వినవుకద ! స్టంట్ సీనుల ప్రభావంవల్ల ఎవరైనా

హాలులో తన్నుకుంటే, వారిని అదు కునేందుకు ఈ ఫస్ట్ ఎయిడ్ బాక్స్' - అని సంజాయిషీ యిచ్చాడు రామా రావు.

—అరెస్ నాగేశ్వరరావు
మాచర్ల

ఇద్దరు పెద్దమనుషులు తీరికూచుని తమ తెలివిని పరీక్షించుకుంటు న్నారు.

'ఆవు ఎలా ఉంటుంది. - చెప్పు చూదాం' - అన్నాడు విశ్వనాథం.

'తెల్లగా' - అని వెంకటపతి జవాబు.

'కాదు. పోనీ, గేదె ఎలా ఉంటుంది?' - మళ్లీ విశ్వనాథం.

'నల్లగా' - అన్నాడు వెంకటపతి.

'కాదు. గొర్రె ఎలా ఉంటుంది?'

"గోధుమ రంగులో'

'కాదు, కాదు, కాదు' అని నిక్కచ్చిగా చెప్పాడు విశ్వనాథం.

'ఏమిటయ్యా ఈ 'కాదు' లు - అదేమిటో నువ్వు చెప్పి అఘోరించు' - అన్నాడు వొళ్లుమండిన వెంకటపతి.

'కత్తిరిస్తే వుంటాయి' - అంటూ పళ్లు ఇకిలించాడు విశ్వనాథం.

— సి హనుమంతరావు
చింతలపూడి

ఏం బ్రదర్, అలా దిగులుగా వున్నావ్?' - కరుణాకరం ప్రశ్న.

లక్ష్మణమూర్తి చెప్పాడు: భార్య పేర 50 వేలు, ప్రేమించి మధ్యలో వొదిలేసిన మీనాక్షి పేర 25 వేలు, అబ్బాయి పేర 30 వేలు, అమ్మాయి పేర 40 వేలు వీలునామా వ్రాశాను."

'భేషుగ్గా ఉంది. ఈ రోజులలో అంతకంటె ఎవరు మాత్రం ఏం చేయ గలరు? స్వంతానికి వుంచుకోకుండా అంతా రాశానని దిగులుగా ఉందా?'

'అబ్బే - అదేం కాదు. అసలీ డబ్బు ఎక్కడ నుంచి తేవడమా, ఎలా తేవడమా అని!'

—డి సత్యమూర్తి
వాడ్రేవుపల్లి

# పాఠకుల తీర్పు

మిత్రులు చందూర్ గారూ: సుస్వరపు మూలుగుతో నడుపుతున్న మీ 'జగతి' 1990 లో రూ 'పసి' కాగలదని ఆశిస్తున్నాను. 'కథావీధి' 'మాలి' తర్వాత 'జగతి'! మీ శక్తి సామర్థ్యాల, జ్ఞాన భాండాలకు తగిన రీతిలో ఈ 'జగతి' ఎప్పుడు రూపొందుతుంది?.... నేను ఈలోకం లోకి వచ్చిన వెనకాలే, మొదటి ప్రపంచ యుద్ధం వచ్చింది. ఎంత సందడి ఈ శతాబ్దంలో! మహాత్ము లతో బాటు మకిలిగాడిదలు - కలగా పులగంగా!.... నేనొక ప్రెస్ కాన్ఫరెన్స్ పెడదామనుకుంటున్నాను - చూద్దాం.... మీరైనా మీరు చూచినవి వ్రాయరే!

—బియస్ రామారావు
మద్రాసు-24

గౌరవనీయులైన శ్రీ చందూర్ గారికి నమస్కారములు. ముఖ్యంగా మీ 'డైరీ' చదువుతూ వుంటే, మీతో పాటు మమ్మల్ని కూడా తీసుకువెళ్లి, ఒక్క ఊపున ఆయా ఊళ్లూ, ఫంక్షన్లూ, వ్యక్తులూ మధ్య మమ్మల్ని తిప్పి, వెనక దిగబెట్టి, హఠాత్తుగా అదృశ్యమైన భావన కలుగుతుంది. అతిగా వ్రాశానని అనుకోకండి - ఫీలయిన థ్రిల్! ఆ అనుభూతి చెప్పాలనే కోరికే ఈ ఉత్తరం వ్రాయిస్తోంది - పాత 'జగతి'లలోని 'డైరీ' అంతా చదవాలని ఉంది. సాధ్యమా?

—యస్ రమణి
వైజాగ్

చందూర్‌గారికి: నమస్కారములు. మొదట 'నిమ్మతొనలు' తర్వాత 'డైరీ' చదువుతాను. 'జగతి' లో కనీసం ఒకటి రెండన్నా కథలు ప్రచురించగోరుతున్నాను. 'సినిమాజంటల' గుర్తింపు పోటీ తిరిగి ప్రవేశబెట్టగలరని ఆశించుచున్నాను.

—వై భాస్కరరావు
కొణకంచి

చందూర్‌గారికి: నమస్కారములు. 'జగతి' ఒక యునీక్ మాగజైన్ – తెలుగులో అటువంటిది అదొక్కటే! ఉత్తమ సంస్కారం, సంస్కృతి, విజ్ఞానం, మైత్రీ వాతావరణం, పరస్పర సఖ్యతా సద్భావాలు ప్రతిబింబిస్తూ వుంటాయి, ముప్పయ్యయిదేళ్లుగా ఒక వ్యక్తి, దానిని ఉత్తమ అభిరుచితో నడుపుతున్నారంటే, అది ఒక అంతర్జాతీయ బహుమతికి అర్హమైనది - ఆంధ్రులు దానిని గూర్చి సగర్వంగా చెప్పుకోవచ్చు.

—డి రామలింగం
హైదరాబాదు-44

# వెన్నెల కెరటాలు

## ఘంటసాల

శ్రీ ఘంటసాల దేశానికి పరిచయమయేనాటికి సంగీత రసికుల పరిస్థితి ఏమిటి ? మనవారు పొరుగు రాష్ట్రానికి వెళ్లి - వాళ్ల బాణీలో శ్రీ త్యాగరాజ స్వామి కృతులు గానం చేసే విద్వాంసుల గానాన్ని ఆనందించగలిగే రసజ్ఞత అల్లవర్చుకుంటున్న సమయం. ఆ సంగీతం పట్ల ఎంతో భక్తి ప్రపత్తులు కలిగినా ఉచ్చారణలో ఉన్న అసహజత్వం వల్ల, అవి మనవి అన్న మమకారం కలిగించలేదు. శ్రీ సి ఎస్ ఆర్, శ్రీ రఘురామయ్య, శ్రీ తుంగల చలపతిరావు, శ్రీ కపిలవాయి రామనాథ శాస్త్రి ఇత్యాదులు అందరూ మహారాష్ట్ర సంగీత ప్రభావంతో గానం చేసినవారే. తెలుగు సంగీత రసికులు ఆ గానంతో కూడా తన్మయత్వం చెందేరు, నిజమే. కాని ఆ పాట కూడా తెలుగుపాట అనిపించలేదు. ఈ పరిస్థితిలో సినిమా తెరవెనుక కంఠం నుంచి వినిపించింది తరాలుగా ఎదురుచూచిన తెలుగు పాట. నవరస భరితమైన పాట, గుండెలు కదిలించిన పాట. అదే ఘంటసాల పాట! తెలుగువాడు నాదీ అని గర్వంగా చెప్పుకోగలిగిన పాట. ఆ పాట అవిచ్ఛిన్నంగా మూడు దశాబ్దాలు వినిపించింది.

—పి సంగీతరావు
'విజయచిత్ర' లో

## ఉపేంద్ర

అయిదారు భాషల్లో అనర్గళంగా ప్రసంగించగల నైపుణ్యం; విషయ పరిశీలనా దక్షత, పాలనానుభవం గల శ్రీ ఉపేంద్ర, కేంద్ర మంత్రి వర్గంలో చక్కగా రాణించ గల రనటంలో సందేహం లేదు. ప్రభుత్వ గమనానికి, ప్రజలతో ఉండవలసిన నిత్యసంబంధాలకు, ఎంతో కీలకమైన సమాచార ప్రసార శాఖలపై అధిపత్యం వల్ల ఆయనలోని సహజ ప్రతిభ మరింతగా ద్యోతకం కాగలదని ఆశించవచ్చు. తెలుగుదేశం పార్టీ పార్లమెంటరీ పార్టీ నాయకుడుగా ఢిల్లీ రాజకీయాలలో ఎంతో చొరవతో, ఎవరినీ నొప్పించక తానొవ్వక, సంక్లిష్ట పరిస్థితులలో గూడా అడ్డంకులను అధిగమించి, ప్రతిపక్ష నాయకుల మధ్య సత్సంబంధాలను ఏర్పరచటంలో శ్రీ ఉపేంద్ర నెరపిన కృషి ఎంతో శ్లాఘనీయము.

—కృష్ణానందమ్
'కర్షకవాణి' లో

## పాతికేళ్ల నాటి మాట

### సంపాదకుడు

ప్రచురణకు రచనలను సంపాదించడమూ, సంపాదించిన వాటినుంచి మంచివి ఎన్నిక చేయడమూ - అది అంతా ఫక్తు సంపాదకులకు సంపూర్ణంగా వదిలిపెడతారు. ఈ సంపాదకులకే ప్రచురణ సంస్థలన్నిట్లోను ప్రత్యేక ప్రాముఖ్యం - ప్రచురణ కార్యకలాపాలన్నిటికీ మూలకందం సంపాదకుడే! కంపెనీ విజయంగాని, వైఫల్యంగాని ముఖ్యముగా ఆయనపైనే ఆధారపడి ఉంటుంది. కంపెనీ బతుకంతా రచయితల ఎన్నికలోనూ, రచనల ఎన్నికలోనూ ఆయనచేసే నిర్ణయాలను బట్టి ఉంటుంది. ఈ సంపాదకుని దృష్టి అంతా దేశంలోని రచయితల వైపు ఉంటుంది - వారిలో ఎవరైనా బాగా ఉపయోగిస్తారని తోస్తే, వారితో సంప్రతింపులు పెట్టుకుంటాడు. అనుకూలంగా వాటిని సరిదిద్దుకోవడానికి దోహదాలు కల్పిస్తాడు - ఉపయోగిస్తారనుకొనే రచయితలకు సలహాలిస్తాడు. మంచి చెడ్డల ఆలోచనలు చెబుతాడు. ఉభయ తారకమైన తీరులు చూపుతాడు - ఒక విధంగా సంపాదకుడు సారస్వత స్కౌటుగా పని చేస్తాడు. ఈ రచయితలకు అంతరంగికులైన ఆసాముల ఆరాతీసి, వారిని పట్టుకొని, తద్వారా కంపెనీకి, వారికి కాంట్రాక్టులు కుదురుస్తాడు. నామరూపాలు లేకుండా, అజ్ఞాతంగా మూలపడియున్న ఎందరో చక్కని రచయితలను, ఎంతో నేర్పుతో బయటికి తీసిన ఈ సంపాదకులు సుప్రసిద్ధా రచయితలను తీర్చిదిద్దిన నిదర్శనాలు, అమెరికా ప్రచురణ పరిశ్రమలో ఎన్నో కనిపిస్తాయి. ఈ విధంగా సంపాదకుడనే వ్యక్తి సాహిత్య సృష్టికర్త అవుతున్నాడు....

—యమ్మెన్ రావు
'పుస్తక ప్రపంచం'లో
'వెన్నె కెరటాలు'

1913 లో జార్జియా బ్రాడ్‌విక్ అను 19 ఏళ్ల అమెరికన్ వనిత, విమానంనుంచి గాలిగుమ్మటం (పారచూట్) ద్వారా దిగింది. అంతకి నాలుగు సంవత్సరాలక్రితం, బెలూన్ నుంచి పారచూట్‌లో దిగిన గౌరవం కూడా అమెదే. ప్రపంచ చరిత్ర ఈ విధంగా గాలిగుమ్మటం ఉపయోగించిన ప్రప్రథమురాలు జార్జియా.

మానవుని మనుగడకు అన్నిటికంటె ముఖ్యమైనది ఉప్పు. ఉప్పు లేకుండా నెల్లాళ్లకు మించి బతకలేరు. అందుకనే ఫలానావారి ఉప్పుతింటున్నామనే సామెత.

—'జగతి' - మే, 1965

# మానవ ప్రగతి

## 'మోరీ' గ్రామంలో

ఆంధ్రకోస్తాలోని ఒక మారుమూల లంక గ్రామమైన 'మోరీ' అతి త్వరలో ఒక అత్యాధునిక పాఠశాల పద్ధతికి ఆదర్శంగా మారనున్నది. ఇప్పుడు ఒక పూరిపాకనే ప్రాథమిక పాఠశాలగా మార్చుకుని విద్యాభ్యాసం చేస్తున్న ఆ గ్రామ బాలలకు.... అదే గ్రామం నుంచి వెళ్లి అమెరికాలో స్థిరపడిన ఒక వ్యక్తి కృషి ఫలితంగా త్వరలోనే ఒక ఆధునిక పాఠశాల సమకూరనున్నది. సాల్మన్ డార్విన్ అనే 'మోరీ' గ్రామ వాసి 17 ఏళ్లక్రితం తన కుటుంబంతో కలసి అమెరికాకు వలస వెళ్లిపోయాడు. తన బాల్యంలో అయిదేళ్లపాటు 'మోరీ' బడికి హాజరైన డార్విన్ ఇప్పుడు అమెరికాలోని 'గ్లెన్ ఫెడ్ ఇన్ కార్పొరేటెడ్' (కాలిఫోర్నియా) సంస్థలో కార్పొరేట్ కంట్రోలర్‌గా పని చేస్తున్నారు. కాగా, 33 ఏళ్ల డార్విన్ ఇప్పుడు తన స్వగ్రామంలోని బాల బాలికలకు ఆశాదీపం లాంటి ఒక విద్యా విషయిక పథకాన్ని రూపొందించారు. ఈ నాలుగు లక్షల డాలర్ల (సుమారు అరవై నాలుగు లక్షల రూపాయల) పథకం 'మోరీ' గ్రామంలో ముందు తరాల విద్యార్థుల కోసం ఒక ఉత్తమ కార్యక్రమాన్ని చేపట్టాలనే తమ చిరకాల వాంఛితాన్ని సఫలం చేయగలదని ఆశాభావం వ్యక్తంచేశారు డార్విన్. ఈ పథకం క్రింద పాఠశాల నిర్మాణం ; పరిపాలనా విభాగాలు, నివాస గృహాల ఏర్పాటుకు రెండు లక్షల డాలర్ల వరకు ఖర్చవుతుంది. పాఠశాల పూర్తిస్థాయిలో పనిచేయడం ప్రారంభించిన తర్వాత పాఠశాల నిర్వహణకై వార్షికవ్యయం పద్దెనిమిది వేల డాలర్ల కంటె ఎక్కువకాదని అంచనా వేశారు. అదేవిధంగా, ప్రారంభమైన అనంతరం ఈ పాఠశాల తన వ్యయాన్ని తానే భరించగల స్థితికి చేరుకుంటుందని కూడా నిర్వాహకులు అంచనా వేశారు. శాన్‌ఫ్రాన్సిస్కోలోని మిషన్ కంపాషన్ ఇన్ కార్పొరేటెడ్ అనే లాభాపేక్ష రహితమైన సంస్థ విదేశాల నుంచి, దేశీయ వనరుల నుంచి రెండు లక్షల డాలర్ల మేరకు ప్రత్యామ్నాయ నిధులను సేకరించి పాఠశాలను నిర్వహించే తన

అనుబంధ సంస్థ అయిన 'ప్రాజెక్ట్ ఇండియా' కు అందజేస్తుంది. 'మోరీ' గ్రామంలో ప్రారంభించదలచిన ఈ 'రెసిడెన్షియల్ స్కూలు'లో లభించే ఉత్తమమైన విద్య కోసం సంపన్నులు తమ పిల్లలను చేర్చుతారని, వీరి ద్వారా లభించే నిధులతో పేద పిల్లలకు ఉచితంగా విద్యాబోధన జరుపవచ్చునని 'మిషన్ కంపాషన్' సంస్థ ఆశిస్తున్నది. వెయ్యిమంది విద్యార్థులను కలిగి వుండే ఈ పాఠశాలలో సగం మంది విద్యార్థులు సంపన్న కుటుంబాలకు చెందిన వారుగా, మరో సగం పేద వర్గానికి చెందిన వారుగా వుంటారు. పాఠశాలలో చేర్చుకునే పేద విద్యార్థులకు పుస్తకాలు, యూనిఫారంలను అందజేయడం జరుగుతుందని డార్విన్ చెప్పారు. అయితే ఈ పాఠశాలలో పేద విద్యార్థులకు లభించే ఉచిత విద్యార్జనావకాశాలు దుర్వినియోగం కాకుండా చూసేందుకై పేద విద్యార్థులను సైతం పరీక్షించిన పిమ్మటనే స్కూలులో చేర్చుకోవడం జరుగుతుంది. 'మోరీ' గ్రామంలోని పాఠశాలలో పెక్కు పాశ్చాత్య విద్యాబోధనా పద్ధతులను భారతీయ వాతావరణానికి అనువుగా మలచి ప్రవేశపెట్టాలని డార్విన్ భావిస్తున్నారు. 'మోరీ' గ్రామంలో 'ప్రాజెక్ట్ ఇండియా' నిర్వహణలోని ఒక చిన్న అనాథాశ్రమానికి సమీపంలోగల రెండు ఎకరాల స్థలంలో ఈ పాఠశాలను నిర్మిస్తారు. కాగా, పాఠశాల బోధనా విభాగంలో పని చేసేందుకు భారతీయ, అమెరికన్ స్వచ్ఛంద కార్యకర్తలను ఆహ్వానించే విషయం కూడా పరిశీలనలో వుంది.

## కొత్తనిర్వచనం

'మరణం' అంటే 'గుండె, ఊపిరితిత్తుల పని నిలిచిపోవడం' అని కాక 'మెదడు మృతి చెందడం'గా నిర్వచించాలని ఫ్లారిడాలోని తంపా జనరల్ హాస్పిటల్ 'చీఫ్ కార్డియాలజిస్టు' గా వున్న డాక్టర్ రాఘువేంద్ర కోరుతున్నారు. మానవ హృదయకోశ మార్పిడి శస్త్ర చికిత్సలు జరపాలంటే .... 'మెదడు మృతి' చెందడంతో మనిషికి మరణం ప్రాప్తించినట్టు అంగీకరించడం అవసరమట; దీనివల్ల హృదయకోశం, కిడ్నీ, లివర్ మొదలైన 'పనిచేస్తున్న అవయవాలను' వాటి అవసరం వున్న రోగులకు అమర్చి పలువురి ప్రాణాలను రక్షించడానికి అవకాశం లభిస్తుందని రాఘువేంద్ర చెప్పారు. అమెరికాలో హృదయకోశ మార్పిడి శస్త్ర చికిత్సలు జరపడంలో బాగా పేరు పొందిన అగ్రశ్రేణి వైద్య నిపుణులలో ఒకరుగా పేరు పొందిన డాక్టర్ రాఘువేంద్ర, 1985 జూన్‌లో ఫ్లారిడాలో జరిగిన మొట్టమొదట్టి హృదయకోశ శస్త్ర చికిత్సను నిర్వహించారు. ఆ తర్వాత ఇప్పటికి ఆయన ఫ్లారిడాలో 65 హృదయకోశ మార్పిడి శస్త్ర చికిత్సలు జరిపారు. ఇండియాలో వైద్యులకు సాంకేతిక పరిజ్ఞానం, మానవశక్తి, నైపుణ్యం.... అన్నీ వున్నాయని వారంటున్నారు.

# కొత్త పుస్తకాలు

'సందిగ్ధ సంధ్య' కవితాసంకలనం, కవయిత్రి: కొండేపూడి నిర్మల. ప్రచురణ: నవోదయ బుక్ సెంటర్, కారల్ మార్క్స్ రోడ్, విజయవాడ -2, వెల: రు 8-00.

'బాష్ప నయనానికి గీసిన కాటుక గీతలూ, వాక్యలతల్లోని వ్యాకులతలూ, కన్నీళ్ల కూడ ఫ్రేం కట్టే కళ్లజోడూ, గుండె కుషన్‌లో నిశ్శబ్దాల గుండు సూదులూ మాదిరి వున్నాయి యివి' అంటున్నారు 'మో' అలల కొలనులో గల గలలు పరిచయం వేస్తూ!

'చిరిగిపోయిన ప్రేమలేఖ, ప్రాణం పోసుకు వస్తుంది. పారిపోయిన పక్షి - పాటతో తిరిగి వస్తుంది' అనే ఆశా భావంలోనే ఆకాశంలో బింబానికి బదులు, ప్రశ్నార్థకం కనిపిస్తుంది. భూభ్రమణానికి భూమధ్య భ్రమణానికి సరిహద్దులు చెరిపివేస్తూ, చూపులు దూరాన అరవేయ మంటారు. పాత నవల పంక్తుల మధ్య రెక్కల పురుగులా అచ్చొత్తుకోవడం విన్నారా? చెట్ల ఆకుల సందుల్లోంచి - చెమ్కీ చూపుల్లో వెన్నెల; వెన్నెల గుచ్చిన చోట చిరిగి - వేలాడుతూ ఓ మబ్బు పేలిక; అందమైన భ్రాంతిని చల్లే చీకటి; ఇటువంటివన్నీ తన హృదయం బ్లాటింగ్ పేపర్‌లా పీల్చు కుందట: 'కళ్లు తెరిస్తే కాంతి గుచ్చు కుంటుంది; మనసు తెరిస్తే వాస్తవం గుచ్చు కుంటుంది .... సంప్రదాయం నియంత కాకపోయినా, చరిత్ర మొత్తాన్ని కుర్చీ కథలుగా మార్చింది' - అంటారు ఈమె మన కళ్లకు కని పింపజేసే 'ఇమేజరీ', గుండెని తట్టి లేపుతుంది. సూటిగా నిర్భీతితో రసో చితమైన నిండు మనసుతో, మాటల పందిరిపై కవితా ప్రసూనాలు వెదజల్లి పరిమళింప జేయగల భావుకురాలు కొండేపూడి నిర్మల. భావచిత్రణ ఒక్కో సారి పాఠకుని బెదర గొట్టవచ్చు; కాని, వాస్తవికతను, మట్టినేలను మాత్రం విస్మరించదు. "మనసైన మనిషిలో మనసునై - మనసులో మనసైన మనిషినై" అన్న 'శిలా లోలిత' రేవతీదేవి కవన జ్వాలను గుర్తుచేస్తున్నారు కొండేపూడి నిర్మల.

✠ ✠ ✠

'ఉపనిషత్ చింతన'. రచన: ఏటుకూరు బలరామమూర్తి. ప్రచురణ: విశాలాంధ్ర పబ్లిషింగ్ హవుస్, 4-1-435, విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాదు - 500001, వెల: రు 10-00.

వేదాలూ ఉపనిషత్తులూ అనగానే సాష్టాంగ నమస్కారం చేయడమే తప్ప 'మన ప్రాచీనులు ఏం చెప్పారు, వాటిలో ఏమున్నది?' అనే ధ్యాస బహు కొద్దిమందికే ఉంటుంది. జెట్ విమానాలు మన అధర్వణ వేదంలో ఉన్నాయని గుడ్డిగా నమ్మేవారు అధికం. ప్రేతాత్మలను పూజించే ప్రాకృతిక మతం, ఋగ్వేద కాలానికి వేయి సంవత్సరాల పూర్వపుది అంటే చాలామందికి నమ్మబుద్ధి కాదు.

ప్రేతాత్మ వాదం అనార్యులది; ఆర్యులవైన వేదాలు బహుదేవతా భావానికి ఆస్కారమిచ్చాయి. రుగ్వేద కాలానికి, ఉపనిషత్ కాలానికీ మధ్య వెయ్యి సంవత్సరాల వ్యవధి ఉంది. బ్రాహ్మణాలూ యజ్ఞయాగాదులూ ఆ మధ్యకాలంలో వచ్చినవే!

'వార్త' అనే మాటను ఈనాడు 'న్యూస్' కి ప్రత్యామ్నాయంగా వాడుతున్నాము. కాని, ఆదిలో, ఆర్యుల విస్తరణ కాలంలో, 'వార్త' అనగా 'వర్తకము' అని అర్థం 'వార్త' (వర్తకం) వల్ల జగము వర్ధిల్లుతుందని చెప్పుకొనేవారు.

యజ్ఞయాగాదులలోని జంతు హింస కారణంగా జనించిన నిర్వేదం, ఉపనిషత్ చింతనకు పునాది. జాలి గుండె గల బుద్ధి సంపన్నులు అడవుల్లోకి వెళ్లి అరణ్యకాలు రచించారు. అదే ఉపనిషత్తుల ప్రారంభకాలం - క్రీ. పూ. 1000 సం॥ అని చెప్పకోవచ్చు.

మొత్తం ఉపనిషత్తులు 108. వీటిలో పది మాత్రమే ప్రధానమైనవి. అవి: ఈశ, కేన, ప్రశ్న, ఐతరేయ, తైత్తిరీయ, కథ, ఛాందోగ్య, బృహదారణ్యక, ముండక, మాండూక్యాలు. ప్రతి ఉపనిషత్తుకీ ఒక వేదాన్ని జత చేశారు. కొన్ని వచనంలోను, మరి కొన్ని సూక్తులలోను వున్నాయి. ఈ ఉపనిషత్తులు రాసిన వారందరూ బ్రాహ్మణులు కాదు. బ్రాహ్మణుడు కాని వ్యక్తి రాసినది గనకనే ఐతరేయానికి ఆ పేరు వచ్చింది (ఇతరుడు). ఉపనిషత్తులలో 'ఆత్మ' అంటే వ్యక్తి; 'పరమాత్మ' అంటే బ్రహ్మ. అన్నిటిలోకీ పెద్దది బృహదారణ్యకం.

'ఈశా వాస్య మిదం సర్వం' అనేది ఛాందోగ్యంలోనిది. అలాగే, 'మాతృ దేవోభవ, పితృ దేవోభవ, ఆచార్య దేవోభవ, అతిథి దేవోభవ' అనేది తైత్తిరీయంలోనిది. క్షురకారుని కత్తిలా అవిద్యను నిశ్శేషం చేసేది ముండకం. మాండూక్యాన్ని చివరి ఉపనిషత్తుగా పేర్కొంటారు. 'వైశ్వానర, తైజస, ప్రజ్ఞ అనేవి జాగ్రత్, స్వప్న, సుషుప్తి అవస్థలలో ఆత్మకు గల పేర్లు; విరాట్, హిరణ్యగర్భ, ఈశ్వర అనేవి పరమాత్మకు గల పేర్లు. తురీయావస్థలో రెండూ ఒకటే, జీవన్ముక్తి లభిస్తుంది. ఆ స్థితిని చేరుకోవడమే బ్రహ్మజ్ఞానం' - అంటుంది మాండూక్యోపనిషత్తు.

ఉపనిషత్ వివరణతో బాటు దర్శన మీమాంస గావిస్తారు ఏటుకూరి బలరామమూర్తి. ●

తర్వాత, తార్కిక జ్ఞానంతో కూడిన 'సాంఖ్యం' హేతువాదానికి ఎంత వేరువగా ఉన్నదీ చెబుతారు. భారతీయ తాత్విక సంపద తెలుసుకోవాలనే తహ తహ వున్నవారందరూ, ఒకసారికాదు, ఒకటికి నాలుగుసార్లు చదివి, జీర్ణించు కోవలసిన పుస్తకమిది. విద్యకు, అవిద్యకు మధ్యగల సరిహద్దురేఖను పరిశీలనాత్మకంగా చూపే జ్ఞానదీపిక.

—క్షీరసాగరమ్

✠ ✠ ✠

'విభవ' - డా॥ జియన్ రెడ్డి అభినందన సంచిక. సత్యశ్రీ ప్రచురణలు, 4, నలందానగర్, తిరుపతి - 517 502. వెల: రు 25-00.

వివరణాత్మక, అభినందనాత్మక - తులనాత్మక, నిర్ణయాత్మక అని 'విమర్శ' నాలుగు విధములని చెబుతారు యస్వీ జోగారావు. తెలుగు 'నుడికారంలోని సొగసులు' మరుపూరు కోదండ రామరెడ్డి, 'అన్నమాచార్య శృంగార నాయిక' తుమ్మపూడి కోటీశ్వరరావు, అన్నమాచార్య ప్రయోగాలు ఎన్ గంగప్ప, కోశ విజ్ఞానమూ మహా నిఘంటువులు గురించి యల్ చక్రధరరావు, బి. రాధాకృష్ణ వివరిస్తారు. 13వ శతాబ్ది నాటి జాయ సేనాపతి 'నృత్త రత్నావళి'లో రత్నకాంతుల తళతళలు భూమిలో, తరంగముల లాలిత్యం నీటిలో, జ్వాలల విలాసం అగ్నిలో, సహజమైన వింత నడక గాలిలో, మెరుపు తీగె ఆట ఆకాశంలో - ఇట్లా సహజ సుందరమైన నృత్తకళ మహిమ పంచభూతాలలో మనం చూడగలం అని చెబుతాడు (పియస్సార్ అప్పారావు).... 'శిలా శిల్పానికంటే ముందు, దంత శిల్పం ఆవిర్భవించింది. మట్టితో బొమ్మలు కాల్చటం ద్వారా నిర్మిత







మైన శిల్పం కూడా ఆ కాలానిదే' - అంటారు సంజీవ్‌దేవ్. వివియల్ నరసింహారావు, (తాళపత్ర గ్రంధ సేకరణ), చల్లా రాధాకృష్ణశర్మ (పూతలపట్టు శ్రీరాములురెడ్డి), గజ్జెల మల్లారెడ్డి (సంపాదకీయం రాయటం) మధురాంతకం రాజారామ్ (కట్టమంచి వారి కమనీయ వ్యక్తిత్వం) కొర్లపాటి శ్రీరామమూర్తి (రంగనాధ రామాయణము) ఈ ప్రత్యేక సంచికలోని తెలుగు విభాగానికి తమ వ్యాసాలతో నిండుతనం తెచ్చారు. అలాగే అంగ్ల విభాగంలో పియస్ సుబ్రమణ్యమ్ (పాణిని), జె మంగమ్మ (కల్నల్ మెకంజీ), కె రామరాజు (దేశీయ వైద్యం, సాళ్వ కృష్ణమూర్తి, (శ్రీనాధుడు) తమ రచనల ద్వారా ఈ అభినందన సంచికకు పరిపుష్టి చేకూర్చారు. పదిహేడు వ్యాసాలూ ఒకొక్కటి ఆణిముత్యం. తెలుగు గ్రంథాలయాలన్నిటిలోనూ విధిగా వుండదగ్గ విలువైన ప్రచురణ.

—సుమతీ సాగర్

## ఈ మధ్య అందినవి :

దృశ్యం – వచన కవితా సంపుటి. సాదనాల వెంకటస్వామి నాయుడు, రాజమండ్రి.... రు 15-00.

బాలలజాతి సంపద - వియస్ కమల – ద్వితీయ ముద్రణ - రు 8-00; రచన - చలసాని ప్రసాదరావు - రు 10-00; రవి కథ (టాగూర్ జీవితం) - చలసాని ప్రసాదరావు, దేవులపల్లి ప్రభాకరరావు - రు 10-00; సాల్వదర్ అలెండి - మిహయిల్ బెల్యత్ - ఎమ్ సుబ్బారావు తెలుగు అనువాదం - 10-00; సారస్వత వివేచన – రాచమల్లు రామచంద్రారెడ్డి - ద్వితీయ ముద్రణ - రు 20-00; తెలుగుభాషా తత్వము – కొమట్రాజు వేంకట లక్ష్మణరావు - రు 25-00; అమెరికన్ నీగ్రో కవులు - సంకలనం, అనువాదం; సెట్టి ఈశ్వరరావు - రు 4-00; ఉదయిని - గంగినేని వెంకటేశ్వరరావు - రు 15-00.... పై పుస్తకాలన్నీ ప్రచురించినవారు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజ్ఞాన భవన్, 4-1-435, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాదు - 500 001.... బ్రాంచీలు: విజయవాడ, హైదరాబాదు, అనంతపురం, విశాఖపట్నం, హన్మకొండ, గుంటూరు, తిరుపతి, కాకినాడ.

అవతార్ మెహెర్‌బాబా - ఎసియస్ వారి అంగ్లానికి నరసింగరావు తెలుగు - మెహెర్ చైతన్య నికేతన్ ట్రస్ట్, మండపేట.

అవతార్ మెహెర్‌బాబా జీవితము, సందేశము.... అవతార్ మెహెర్‌బాబా ఆధ్యాత్మిక కేంద్రము, రాజమండ్రి.

The Middleman and Other Stories by Bharati Mukherjee. Prentice-Hall of India Private Ltd., New Delhi - 110001... Rs. 39-00.

సమీక్షలు

# చిత్రజగతి

## ఉషా ఆర్ట్ వారి 'చెవిలో పువ్వు'

ప్రసాద్‌కి (రాజేంద్ర ప్రసాద్) 'స్లీప్ వాకింగ్' (నిద్రలో నడవటం) అనే చిన్న రుగ్మత ఉంది - అందువల్ల మేనమామకు (సాక్షి రంగారావు) యితనంటే మరింత జాలి. ఒకసారి అప్పలమ్మ పక్కలో పడుకున్నప్పుడు (నిద్రలో అతనికి స్పృహవుండని కారణంగా) కాపాడగలిగాడు. అయితే ఈసారి కొత్తగా పెళ్లయిన తన కూతురు పట్టెమంచం ఈ అమాయకుడు సుఖనిద్ర పోతూవుండటం ఆగ్రహావేశంతో కొత్త అల్లుడుగారు చూస్తాడు. అప్పటికే టేప్ రికార్డర్ యిస్తేగాని మొదటిరాత్రి అంగీకరించని ఈ జామాత, జరిగిన అపచారానికి ఇరవైవేలు జుల్మానా చెల్లిస్తే తప్ప అమ్మాయిని ఏలుకోనంటాడు. అప్పటికే తడిసి మోపెడై అప్పులపాలైన మామగారు కొత్తల్లుడు కాళ్లమీద పడతాడు. అతను ఈ పప్పులు ఉడకవంటాడు. తనుచేసిన తప్పుకి పరిహారంగా, ఆరు నెలల్లో ఇరవైవేలు సంపాదించుకొచ్చి వారి కాపరం నిలబెడతానంటాడు మానధనుడైన ప్రసాద్. పట్నం వచ్చి, 'వీరానామ్ పైప్స్' లో (భారీ నీటి గొట్టా), మిగతా బిచ్చగాళ్లతో బాటు తల దాచుకుంటూ, చెత్తకాగితాలు బస్తాలోకి ఏరి, వాటి అమ్మకం ద్వారా పొట్టపోసుకుంటూ వుండగా, ఒక రోజున బీట్ కానిస్టేబుల్ యితనిని దొంగ అనుకుంటాడు. నలుగురూ గుమిగూడి ప్రసాద్‌ని చావబాదుతూ వుండగా, ఎదురింట్లోనుంచి వచ్చిన అనుపమ (సీత) ఈ నిర్భాగ్యుని కాపాడుతుంది. ఆమె ఈ యువకుని వెనకొక బస్ ప్రయాణంలో చూసింది ; ఆ తర్వాత కాఫీ హొటల్‌లో మొహం తేలేయగా తను కాపాడింది ; వెరైటీ టూత్ పవుడర్ తనకి అక్కర్లేకపోయినా, అతనికోసమని నాలుగు పాకెట్లు కొని, తొందరలోనే అతని నిజాయితీకి ముగ్ధురాలయింది. ఇంత కథవుండటంవల్ల లోపలికి తీసుకొచ్చి, కడుపునిండా అన్నం పెట్టి, తండ్రి రంగారావుకి (డి వి నరసరాజు) ఎమ్ ఎ పాసైన ఈ యువకుని దురవస్థ వివరించి, సునాయాసంగా ఒక ఉద్యోగం వేయించడమేగాక, అతనికి కావలసిన ఇరవైవేలూ నిమిషాలమీద సర్దు

తుంది. రంగారావు ఏకైక తనయ అనుపమ, పెళ్లిబాసికాలైనా తీయక పూర్వమే కారు ప్రమాదంలో భర్త చనిపోవడంతో వితంతువు అయింది. కృతజ్ఞతా పూర్వకంగా ప్రసాద్‌యిచ్చిన వెండి కుంకుమ బరిణెలోని కుంకుమ, స్వహస్తాలతో అతను ఆమె నుదుట తిలకం దిద్దేందుకు అయిదేళ్లు పడుతుంది. మధ్యలో అపోహలు, అనుమానాలు, కపటనాటకం, విలన్, శ్రీలక్ష్మి బ్రహ్మానందాల హాస్యపుజల్లు, సుధాకర్ పెద్దరికం, రచయిత్రి మనని దయదలిచి కథ చెప్పకుండా వుండటం, భర్త స్లీప్‌వాకింగ్ భార్యకు సంక్రమించడంతో ముగుస్తుంది – ఈ హాస్య చిత్రం. కొంచెం 'ట్రిమ్' చేయవచ్చునేమో ననిపించింది. దర్శకులు : సత్యనారాయణ. నిర్మాత : అశోక్‌కుమార్.

## స్వైరీ ఫిలిమ్స్ 'ప్రత్యూష'

తెలంగాణాలో జోగినీలు, కర్ణాటకలో బసవీలు గురించిన వార్తలు గత పెడెనిమిదేళ్లుగా పత్రికల కెక్కుతున్నాయి. ఈ దురాచారం ముఖ్యంగా వెనుకబడిన తెగలలో, అంటరాని వారనే వారిలో, అజ్ఞానమూ, మూఢ నమ్మకాలూ వల్ల వేళ్లు పాతుకుపోయి వుంది. అగ్రవర్ణాలవారు వెలయాలుని దేవదాసీగా, వేశ్యను కళావంతురాలిగా చేస్తే, అడుగునున్నవారు, అమ్మవారికి అర్పించడమనే సాకుతో ఆడదాన్ని 'అతి ప్రాచీనవృత్తి'కి సాంఘిక ముద్రతో దింపారు. తెలంగాణా ప్రాంతంలో యిప్పటికీ వందల సంఖ్యలో జోగినిలు వున్నారని దరియాప్తులలో తేలింది. అటువంటి ఒక దురదృష్టవంతురాలి కథే 'ప్రత్యూష'కు యితివృత్తం. ఇంకా తెల్లవారలేదు ; వెలుగురాలేదు ; ప్రాగ్దిశను అరుణకాంతి కనిపిస్తోంది – అంత దాకానే! తనకూతురు లక్ష్మి తనకిమల్లే జోగిని కాకూడదని పోచమ్మ పట్టుపడుతుంది. మంచంమీద వున్నతల్లి, కులవృత్తికి అది అపచారమనీ, అమ్మవారికి ఆగ్రహం మొస్తుందనీ వారిస్తుంది. పండగ చేసుకోవడమంటే, స్త్రీపురుషులు వొళ్లెరగనంతగా చెడ తాగటం ! వారటువంటి అంధకారంలో ఉండి, గొడ్లమాదిరి చాకిరీ చేయడమే ఖామందులకు కావల్సింది. పోచమ్మకి పదిరూపాయిలు అప్పిచ్చే రైతుపెద్ద, నోటు పైనుంచి కిందికి జారవిడుస్తాడు – తను మైలపడకుండా! కాని, పోచమ్మవంటి జోగినిలతో సెక్సుకి ఎటువంటి అభ్యంతరం వుండదు. కూతురు లక్ష్మిని ఒక యింటిదాన్ని చేసేందుకు, ఊరు వొదలివెళ్లిపోతానంటుంది పోచమ్మ. కాని, ఊరిపెద్దలు వెళ్లనీయరు ; ఆమెకు పని యివ్వకూడదనీ తిండిపెట్టకూడదనీ ఆంక్షవిధిస్తూ వెలివేస్తారు. అన్ని మార్గాలూమూసుకుపోగా నిస్సహాయురాలైన పోచమ్మ వరికంకులు కోసిన కొడవలితోనే, తన కూతురు మెడకోసి, తనచుట్టూ చేరిన ప్రజమీద రౌద్రారుణ కాంతులు ప్రసరిస్తూ కొడవలి ఝళిపిస్తుంది. ఆమె తన పీకె కోసుకుందో, లేక పోలీసులు

పట్టుకెళ్లారా? - అనేది అప్రస్తుతం నిరాగా నిర్భయంగా నడిచే ఆ యువతికి 'కొడవలే' (సంకేతం) శరణ్యమవుతుంది ....

'ఫాసా' వారు (FASA- Feminist Association for Social Action) నిర్మాతలు దీనిని డాక్యుమెంటరీ అన్నారు. డ్యుయెట్స్‌కి డిష్కు డిష్కులకి అలవాటుపడ్డ ప్రేక్షకులు యిందులోని దయనీయగీతాన్ని వినలేరు; కళాకౌముదిని చూడలేరు. అక్కడక్కడ స్లోగా ఉన్నప్పటికి నేపథ్య సంగీతం గుండెలు పిండుతుంది. కీచురాళ్లు కావ్యగీతికని ఆలపిస్తాయి. పాత్రధారులలో కాదంబరి, గోదావరి, రాజమల్లు, పోశెట్టి యిలా చాలా పేర్లు వున్నాయి. ఎవరెవరో తెలియదుకాని ప్రతిఒక్కరూ మెప్పించారు. దర్శకులు జె. వెంకటస్వామి నాయుడు సోవియట్ కల్చరల్ సెంటరులో ఆహ్వానితులకి ఈ పిక్చర్ చూపారు.

## అస్వామీచిత్రం 'ఆర్డియల్' (ORDEAL)

'ఆర్డియల్' అనే మాటను తెలుగులో అగ్నిపరీక్షగా చెప్పుకోవచ్చు. ఒక సంప్రదాయ సంపన్న కుటుంబంలోని పెద్దకొడుకు పేరు మోహికాంత; అతని తమ్ముళ్లు భద్రకాంత, రత్నకాంత. రైసుమిల్లు పెట్టి రెండు చేతులా సంపాదిస్తున్న ఈ మోహికాంతకి అధికధనంతో బాటు, తాగుడూ, అహంకారం, తనంతవాడు లేడనే గర్వం యిత్యాదులన్నీ అబ్బుతాయి. 1930ల నాటి కథ. స్వార్జితం అవడం వల్ల తమ్ముళ్లని బంధువర్గాన్ని చాలా చులకనగా చూస్తూ తను అధికుడనను కుంటాడు పదకొండేళ్లు కాపరం చేసిన భార్య మేనకకు నలుగురు పిల్లలు. వేళగాని వేళ ఆమెని బెడ్‌రూమ్‌కి పిలుస్తూ వుంటాడు. గృహకృత్య భారంతో, అత్తమామల సేవలతో తలమునకలయే మేనక, 'పిల్లలు ఎదుగుతున్నారు - కాస్త తెర మరుగు వుండొద్దా?' అని భర్తని వారిస్తూ వుంటుంది. తన మాట సుగ్రీవాజ్ఞగా భావించాలనుకొనే ఈ ధనోన్మత్తుడు, 'కిరణ' అనే మరొకమ్మాయిని పెళ్లి చేసుకు యింటికి తీసుకొస్తాడు. బాగా డబ్బున్నవాడు కాబట్టి ఎవరూ నోరెత్తరు - చిన్నావిడ వుండటం సర్వసామాన్యమైనదిగా భావిస్తారు. కొంచెం చనువు ఏర్పాడ్డాక మేనక అడుగుతుంది; 'ఈయనకు ఒక భార్య, నలుగురు పిల్లలు వున్నారనే సంగతి మీవాళ్లకు తెలియదా?' - అని! 'తెలుసు .... పేదరికం .... మా నాన్నకి బాగా ముట్ట జెప్పారు.... నేను అశక్తురాలిని' - అని ఉన్నదున్నట్లు చెబుతుంది కిరణ.... మోహికాంత యిద్దరితోటీ సంసారం చేదామనుకుంటాడు. కాని, ఆత్మాభిమానురాలైన మేనకతనని తాకవద్దని శాసిస్తుంది. 'ఈ యింటి కోడలుగా, ఈ పిల్లల తల్లిగా నా బాధ్యతలు నెరవేరుస్తాను. అంతే గాని నా వొంటి మీద చేయి పడిందా, వూరుకోను' - అని నిష్కర్షగా చెబుతుంది. కిరణకి ఆడపిల్ల కలుగుతుంది.

మేనక చూపే నిరాదరణ, నిర్లక్ష్యమూ మోహికాంతని మరింత వెర్రివానిగా చేస్తాయి. ఇంట్లోవాళ్ళకి, చుట్టుపక్కల వాళ్ళకి మేనక అంటే ఎంతో గౌరవం; ఇంత కష్టబడి కట్టుకున్న రెండో భార్య కిరణకి సైతం మేనక అంటే ప్రాణం; తన భార్య తనకి లోబడనని మొండి కేయటం తల కొట్టేసినట్లు ఉంటుంది. రెండుసార్లు ఆమెని బలాత్కరించ బోతాడు; ఆమెలో ప్రజ్వరిల్లిన ప్రతీకారవాంఛ, 'మదన్' అనే వ్యక్తితో, అక్రమ సంబంధం పెట్టుకొనేటట్టు చేస్తుంది. ఈ మదన్ మీద ప్రేమ కాదు, భర్తమీద కసి. తను గర్భవతి అయి, మోహికాంత చెంప ఛెళ్ళుమనిపించాలి. నర్సు ఇరిన్, మేనక తల్లి కాబోతోందని, చెప్పేసరికి అతను నిర్ఘాంతపోతాడు. ఆ బిడ్డ తండ్రి ఎవరో తెలుసుకోలేడు; తనవల్ల కలగలేదని చెప్పుకోలేడు. దశరథుడు ముగ్గురిని పెళ్ళిచేసుకోలేదా? - అని ఒకప్పుడు ధీమాగా పలికిన భర్తతో మేనక అంటుంది. 'సీతాదేవిలా స్త్రీ ఎంతో సహనం చూపాలంటారు; నిజమే, ఆ మగవాడు శ్రీరాముని పోలినవాడు అయిన వుండాలి కదా! వెనక నలుగురు, కిరణకి ఒక ఆడపిల్ల, ఇప్పుడు నాకు ఒకరు - మొత్తం ఆరుగురు.







కావాలంటే మరొక యిద్దరు అమ్మా యిల్ని చేసుకోండి – నాకేమీ అభ్యం తరం లేదు' - మొహంమీద అం టుంది మేనక - విజయం సాధించిన వీరవనితలా. ఈ 'అగ్నిపరీక్ష'కు నిలువునా నీరవుతాడు మోహికాంత. మేనక మాత్రం ఠీవిగా తన గుర్రపు షార్టులో వెళ్ళిపోతుంది. మలయా గోస్వామి మేనక పాత్రను అద్వితీ యంగా పోషించింది. దర్శకులు భవేంద్రనాథ్ సైకియా మొదటి చిత్రం 'సంధ్యారాగ్' 1977లో 'రాజ కమలం' పొందింది; రెండవ చిత్రం 'అనిర్బాన్' కి 1981 'రాజ కమలం'. ఇది మూడోది. 'వివాహ బంధంలోని పరస్పర విశ్వాసం సంఘం కోసం కాదు - వ్యక్తుల ఆత్మోన్నతి కోసం' - అంటారు దర్శకులు భవేంద్ర నాథ్ సైకియా .... 'ఫాసా' వారు (FASA)- Feminist Association for Social Action) తమ ఫిలిమ్ ఫెస్టివల్ సందర్భంగా సోవియట్ కల్చరల్ సెంటరులో ఆహ్వానితులకి చూపారు.

## ఇండో – వోవర్సీస్ 'స్పానిష్ కనెక్షన్' (Spanish Connection)

నాటకీయత సునిసిత హాస్యమూ. ప్రణయ పయోధి గల 'జాకీ చాన్' యాక్షన్ త్రిల్లర్ యిది. త్రిల్లర్ కాబట్టి మొదట్నుంచీ చివరిదాకా కొట్లాటలు కాదు.... ఛాసూ, బియావో — ఈ యిద్దరు ఆప్త మిత్రులూ ఆత్మరక్షణకు అవసరమయ్యే విద్యలలో అఖండులు వారిలో ప్రాతఃకాలాలు శరీరపాటవ పోటీలో ఒకరొకరు తలపడటంతో ప్రారంభమై, చిత్తుగా తన్నుకు, హాయి గా షవర్ కింద కూచుని, అప్పైన గ్లాసెడు పాలు తాగి, పనిలోకి వెళ్లడంతో ప్రారంభమవుతాయి. వారి పని యేమిటంటే, తమ మొబైల్ కాంటి న్‌లో, జనసమ్మర్దం గల ప్రదేశానికి వెళ్లి ఒకరు టిఫెన్లు తయారు చేసి అందిస్తూ వుండగా, మరొకరు మను షుల మధ్యకు వెళ్లి అమ్మడం, ఆర్డర్లు తీసుకు రావడం, డబ్బు వసూలు చేసుకోవడం - ఈమాదిరి ఎవరితో ఏ గొడవా లేకుండా, హాయిగా, దర్జాగా స్వతంత్రంగా బతుకుతున్న ఈ నవ యువకుల కంటపడుతుంది, జేబులు కొట్టే ఒక సుందరాంగి. ఇంత అంద మైన పిల్ల యిటువంటి దౌర్భాగ్యపు పని చేయడమేమిటని విస్తుపోతూండగా, తరుముకొస్తున్న దుండగుల నుంచి, ఆమె కారాత్రి వీరు తమ ఫ్లాట్‌లో ఆశ్రయ మివ్వవలసిన పరిస్థితి ఏర్పడు తుంది. ఈ సుందరి 'కిలాడీ దొంగ' అని తెలిసినవారై వుండటంచేత, తమ పర్సుల్లో పెద్ద నోట్లు, ఒకరు కాగితాల అడుగున, మరొకరు కాలి బూట్లలోను దాచి, చిన్న నోట్లతో పర్సులు డ్రాయర్లలో వదిలేస్తారు. 'మీ ఇద్దరిలో ఎవరు ఈ రాత్రికి నాతో పడుకుంటారు?' —అని ఆ అమాయకు లిద్దరినీ హడలుగొట్టిన "లోలా" తెల్లారేసరికి, వీరు రహస్య స్థావ

రాలలో దాచిన డబ్బుతో మాయమవుతుంది. ఇద్దరు మిత్రులు ముఖాలు చూసుకు, పోయిన డబ్బు తమది కాదని సరిపెట్టుకు, మొబైల్ కాంటీన్‌తో నిత్యకృత్యంలో పడతారు. సుందరాంగి లోలాని ఈసారి ప్రయివేట్ డిటెక్టివ్ సామొ, మరికొందరు దుండగులూ వెంబడించడం చూస్తారు. ఈ వీరులిద్దరూ మళ్లీ ఆమెని భద్రంగా కాపాడి, ఫ్లాట్‌కి తీసుకొచ్చి, 'నీవు యిలా దొంగతనాలు చేయకూడదు— మంచి మార్గాన బతకాలి' — అని హితవు చెబుతారు. 'నన్ను ఆదుకొనే వారెవరైనావుంటె చెడ్డపనులు ఎందుకు చేస్తాను?' — అంటుంది లోలా. 'మేము వున్నాం' అని వారు ధైర్యం చెప్పేసరికి, లోలా తను ఋజుమార్గాన బతుకుతానని వాగ్దానం చేస్తుంది. ఆమె తన మాట నిలబెట్టుకుంటుంది; వీరు ఆ స్పానిష్ రాకుమారిని తమ ధైర్యసాహసాలతో వుచ్చులో నుంచి బయట పడేస్తారు. దర్శకత్వం: సామొ హంగ్; వియస్ ఎంటర్ ప్రయిజెస్ వారి విడుదల .... పిఆర్ఒటియమ్ రామన్. ✷










?

"Mammals hold objects with their forelegs or arms. Man is the only species that could successfully use the fingers and become a tool-making animal. That Kabandha, they say, had only one eye at his breast and with his hidden mouth would easily swallow whatever he grabbed with his hands," said Raghu.

"That was only a symbolic description of the ferocious monster that could use the arms as tentacles," observed Raghu's Father.

"Do you mean to suggest that Rama and Lakshmana with their deft fingers cut down those arms ?"

"Exactly. At his request they killed him and burnt that huge carcass with a mountain of flesh. Out of the ashes emerged a *Divya Purusha* who advised the brothers to proceed in the western direction and make friends with Sugreeva hiding on the Rishyamuka Hill near Lake Pampa. And on the way they should visit Sabari living in the hermitage once belonged to Matanga. Kabandha was the character that helped Rama with the method and manner in which he could regain Seeta," explained Raghu's Father.

---

*Swadharma Swaarajya Sangha (Director : BVSS Mani*
*Beehive Bldgs - 29, Prakasam Road, Madras - 600 103*





1990 ఫిబ్రవరి 06

భాషా భేదాలకు అతీతమై సాంస్కృతిక వంతెనలు నిర్మిస్తుంది సంగీత ఝరి. జర్మన్ డెమొక్రటిక్ రిపబ్లిక్‌వారి వాద్య సంగీతాన్ని, ప్రాక్ పశ్చిమ సమ్మిళితమైన కర్ణాటక సంగీతాన్ని ఇండియన్ కౌన్సిల్‌వారు, తూర్పుజర్మనీ కల్చరల్ డిపార్ట్‌మెంటు సహకారంతో, మ్యూజిక్ అకాడమీలో ఏర్పాటు చేశారు........................

(10 Days of GDR Culture in India... Indo - German Presentation - Dr. L. Subramaniam Ensemble and Collegium Instrumentall Halle... Indian Council for Cultural Relations) రెండు హాండెల్‌వి, ఒకటి బాచ్‌ది అర్కెస్ట్రామీద అయాక, యల్ సుబ్రహ్మణ్యం 'స్ప్రింగ్ రాప్సోడీ' (Spring Rhapsody) 'నాదప్రియ'లో పురందరదాసు కీర్తననీ ద్వివిధ సంగీతవాహినుల వారధిగా సమకూర్చారు. సుబ్రహ్మణ్యం వయొలిన్‌కి, శ్రీనివాసన్ మృదంగం, సుభాష్ చంద్రన్ ఘటం, శ్యామసుందర్ కంజీరా, గణేశన్ తంబూరా .... పాశ్చాత్య సంగీతానికి దర్శకులు స్టీఫెన్ లీస్నర్, కాన్సర్ట్ మాస్టర్; ఫ్రిడ్ హార్డ్ రిచ్‌టర్. సంగీత సంప్రదాయం తెలియనప్పుడు, దానిని మనమంత 'ఎంజాయ్' చేయలేకపోవచ్చు. కాని శబ్దతరంగ లాస్యంలోని రాగ విపంచి, మనని వసంత సమీరంలా తాకుతుంది.

. . . . .09

"అల్లు రామలింగయ్యగారికి పద్మశ్రీ యిచ్చారా? ఆయన సాధించిన దేమిటి? ఆయన ప్రత్యేకత ఏమిటి?" అని ప్రశ్నించేవారు చాలా మంది ఉంటారు. ఆయన విశిష్టత ఏమిటో, ఆయన ఘనత ఏమిటో దగ్గిర్నుంచి చూస్తున్న మాకు తెలుసు. ఆ 'డిటాచ్‌మెంటు' మాలో ఎవరికీ లేదు. ఆ తాత్విక చింతన, సంక్షేమ దృక్పథం, లోతైన మనసు బహు కొద్దిమందిలో కనిపిస్తాయి. ఆరువందల చిత్రాలలో ఆయన నటించిన పాత్రలకు భిన్నమైనది, సత్కుటుంబీకునిగా ఆయన నిర్వహించే పాత్ర. ఈ నిజ పాత్రలోనే సిసలైన అల్లు రామలింగయ్యగారిని చూడగలుగుతాం. ఆయనిది

నిర్విచారమైన మన స్తత్వం — అటు వంటి మహా సంపద ఎందరికి లభ్య మవుతుంది?"— అని మెచ్చుకున్నారు దాసరి నారాయణరావు, కళాసాగర్ వారు రాజా అణ్ణామలై హాలులో, అల్లు రామలింగయ్య గౌరవార్థం ఏర్ప రిచిన సభావేదిక మీద. ఈ సంద ర్భంగా 'పూజకు వేళాయెరా' అనే హాస్య నాటికను ప్రదర్శించారు. మద్రా సులోని తమిళ రంగస్థలంతో కాస్తో కూస్తో పరిచయం వున్నవారికి, యిటు వంటి ప్రదర్శనలు అంతగా నచ్చవు. చెప్పుల షాఫుగాని, తల్లీ కూతురూ జరిపే వ్రతంగాని సామాజిక వాస్తవి కతతో సంబంధం లేనివి.

. . . . . 10

గుంటూరు వెంకటేశ్వర బాలకుటీర్ ప్రభావతి, చిల్డ్రన్స్ గార్డెన్ స్కూలు వారి 'ఫామ్' (FARM) చూస్తానంటే, ఎలావెళ్లాలో దారి, శకుంతలా శర్మని కనుక్కొని, మధ్యాహ్నం రెండున్నరకి బయలుదేరాం, షోలింగనల్లూర్‌కి మా ఇంటి దగ్గిర్నుంచి పాతిక కిలోమీటర్లు ఉంటుంది - ముప్పయికి లోపే! రానూ పోనూ ఒకొక్కగంట, అక్కడ ఒకగంట - మొత్తం మూడుగంటలని లెఖ్క వేసుకున్నాము. కాని, రెండు న్నర గంటలలోనే తిరిగిరాగలిగాము. ప్రభావతీ, మంగాదేవి తమ సంస్థ తరఫున, గుంటూరునుంచి చిలకలూరి పేటకు (?) వెళ్లేదారిలో, పదమూడెక రాల స్థలం కొన్నారు. కాయగూరల పండించటం, డెయిరీఫామ్, హోమ్ ఫర్ ది ఏజెడ్, అర్ఫనేజ్ - యిలాటి వెన్నో స్కీములు మనసులో ఉన్నాయి. అందుకనే ప్రభావతికి ఈ స్కూలు ఫామ్ ఎలా ఉందో చూడాలనే ఆసక్తి ... షోలింగనల్లూరు గ్రామం (మద్రాసు - 600096) యమ్‌జిఆర్ రోడ్‌లో ఉంది. 'శర్మాస్ కాంపింగ్ సెంటర్' లో శారదాంబ స్టూడెంట్ మోహనరావు మమ్మల్నెంతో ఆదరంగా రిసీవ్‌చేసుకు, 'ఫామ్' అంతా చూపించాడు. ఆ ప్రాం గణంలో పాదంపెట్టగానే అమృత హృదయులైన శర్మగారి గురించి జ్ఞాపకాలు రాకమానవు. క్రితంసారి వచ్చి నప్పుడు అయన వున్నారు - ప్రేమ్ చంద్ దంపతులు కూడా వచ్చారా రోజున. డాక్టర్ శర్మా, మిసెస్ శర్మాలు, అసంఖ్యాక జీవితాలలోకి కాంతి కిరణాలు తెచ్చారు. ఆ పుణ్యదంపతులు భౌతికంగా లేకపోయినా, వేలాది గుండె లలో చిరంజీవులై స్ఫూర్తి నిస్తున్నారు. ఈ ఏప్రిల్ ఇరవైమూడుకి పూజ్యులు శర్మగారు దివ్యపథంజేరి నాలుగేళ్లవు తుంది. మాఇంట్లో ఏమూలచూసినా ఆయన జ్ఞాపకాలేకాదు; ఈ సుక్షేత్ర మూ, ఈ పచ్చటిచెట్ల మీదనుంచి వచ్చే సన్నటి పరిమళం, ఆయన కూచుని రాసుకొనేగది, పక్షుల కలకల, పిల్లల గలగల ఒకటిగా చూడగల ఆ హృదయ సౌకుమార్యం, అంతర్వీక్షణే తప్ప పరుషవాక్య మెరగని ఆయన సౌజన్యం - అక్కడున్నంతసేపూ ఆ 'మూర్తే' మాయిద్దరి మనసుల్లోనూ మెదిలారు. ఆయన లేరని తెలుసు - కాని, స్వయంగా నాటిన క్షేత్రంలో,

ఆయన లేకపోవడ మేమిటనిపించింది. అదేనేమో ఇహపరాల మధ్యనుండే అదృశ్యరేఖ .... మోహనరావు తెప్పించిన వేడికాఫీ(తాగి, కాసేపు ఆ చెట్ల మధ్య తిరిగి ఇంటి ముఖం పట్టాము. వెళ్లేటప్పుడు దారికనుక్కుంటూ వెళ్లడం కాబట్టి ఒక పదినిముషాలు ఎక్కువ పట్టింది: .. కొబ్బరి చెట్లతోబాటు యింకేమేమి చెట్లు గుంటూరులోని తమ 'ఫామ్' లో వేయాలనేది ప్రభావతికి సంబంధించిన విషయం. 'అక్కడి నేలను బట్టి వ్యవసాయ శాఖవారు మీకు గైడెన్స్ యిస్తారు; మీరు వెళ్లి అడగాలి - అంతే! ఒక మంచిపని చేస్తున్నప్పుడు చుట్టూవారు ఎలా సహకరిస్తారో స్వానుభవంలో మీకు తెలుసు కథ ?' - అన్నాను. (ఇరవై పాతికేళ్ల క్రితం నలుగురు స్టూడెంట్స్‌తో ప్రారంభమైన వెంకటేశ్వర బాలకుటీర్ లో ఈనాడు సుమారు రెండువేల మంది ఉన్నారు).

. . . . . 13

ఆంధ్ర ముఖ్యమంత్రి చెన్నారెడ్డిని, తమిళనాడు ముఖ్యమంత్రి కరుణానిధి 12వ తేదీన వళ్లువార్ కొట్టమ్‌లో అభినందిస్తున్నట్టూ, అక్కినేని నాగేశ్వరరావు సభాధ్యక్షులని, ఆంధ్రప్రదేశ్ మంత్రులు హనుమంతరావు (సినిమటాగ్రఫీ), సమరసింహారెడ్డి (రెవిన్యూ), రవీంద్రనాథ్ చౌదరి (ఎన్‌డౌమెంట్స్), తమిళనాడు విద్యుత్ శాఖమంత్రి








వీరాస్వామి ఈసభలో పాల్గొంటారనీ, .... తెలుగుఫిలిమ్ ఇండస్ట్రీకి చెందిన కమిటీ ఆఫ్ హెూస్ట్స్ (మద్రాసు) పంపిన ఇన్విటేషన్ యివ్వాళ (13వ తేదీ) మధ్యాహ్నం పోస్టులో వచ్చింది. అంచేత, వెళ్లడం పడలేదు. ఆ సభావిశేషాలు వినడమేతప్ప స్వయంగా తెలియవు.

..... 14

ప్రఖ్యాత సినీ దర్శకులు సింగీత శ్రీనివాసరావు - లక్ష్మీ కళ్యాణి దంపతుల పెద్దమ్మాయి సౌ॥ శకుంతలకు, కంప్యూటర్ ఇంజనీర్ చి॥ సతీష్‌కు ('హెచ్‌పిసి' మేనేజరు పాండురంగన్ దంపతుల కుమారుడు) ఈ ఉదయిం పదింముప్పావుకి విజయరాణీ మహల్ లో వేదోక్తంగా వివాహం జరిగింది. నవ దంపతులకు మా శుభాకాంక్షలు .... జర్నలిస్ట్ భరద్వాజ రెండవ కుమార్తె సౌ॥ లక్ష్మీ అన్నపూర్ణ కుమారికి, చి॥ సుబ్బరాయలుకి (యన్వీడి శర్మకుమారుడు) ఉదయం11గం॥ 6 ని॥లకు రాఘాలాల్జీ కళ్యాణ మండపంలో శాస్త్రీయంగా వివాహం జరిగింది. పెళ్లికూతురు అక్కగారు శివకామి, మా మేనకోడలు పద్మప్రియ యిరువురూ కాలేజి మేట్స్ — జోర్హాత్‌లో (అస్సాం) ఫ్రెండ్సు— వారి భర్తలు 'ఒయన్‌జిసి' ఉద్యోగులు; భరద్వాజ చిరకాల మిత్రులు. 'విజయరాణి' లో కమలాకర కామేశ్వరరావుగారితో కబుర్లు; ఇక్కడ డివి నరసరాజు గారితో భోజనం. నవదంపతులకు మా శుభాకాంక్షలు.

..... 15

సాహిత్య అకాడమీ ప్రాంతీయ కార్యాలయం నిర్వహించిన 'లిటరరీ ఫోరమ్' లో, పికె జాయ్, భూపతి, సుందరేశన్ తమ ఆంగ్ల కవితలు చదివి వినిపించారు. యాచన వృత్తిగా గల బిచ్చగానికి 'ఓటు తెప్పించి, నీ కన్నీరు తుడిచేందుకు నేను పుట్టానని నమ్మకంగా చెప్పే రాజకీయవేత్త, ఓట్ల బిచ్చంతో అందలమెక్కి, తను ఎక్కిన నిచ్చెన తోసివేసే ఘాతకుడవటం నలభై రెండేళ్లుగా మన కళ్లముందు కనిపిస్తున్న దృశ్యం. (పికె జాయ్).... చెట్లు వుండవు, పక్షుల పాటలు వుండవు, పచ్చని నేల వుండదు - అది మహాపట్నం — అక్కడ మన మన సొక పోస్ట్‌బాక్స్. ప్రేమ అనగా నిశీధి విహారాలే కదా — అని అడుగుతుంది కాలేజీ కన్య (భూపతి) .... ఎలక్ట్రిక్ ట్రయిన్‌లోని గుడ్డి బిచ్చగానిని చూశారా ? 'నేను కవిత్వం వ్రాస్తున్నాను. తుళ్లి పడే కెరటాన్ని తృటికాలమనే సూదిలో గుచ్చుతున్నాను' అని చెబితే, 'ఎందుకయ్యా అలాటి పిచ్చిపనులు ? వ్యాసుని కంటె, వాల్మీకి కంటే యివ్వాళ నువు కొత్తగా రాసేదేమున్నది?' అని గదమాయించే మంత్రిగారు, తన ఉపన్యాస పాఠమంతా పత్రికలో కనిపించాలనుకుంటాడు (సుందరేశన్). సూర్యకాంతిని అరవేసినట్టు తళ తళ లాడుతుందట తారు రోడ్డు .... ఒక గంట సేపు

వినిపించారు ముగ్గురూ తమ అపూర్వ కవితలు. ఎవరి బాణీ వారిది. కాని, వారిలోని కవితాత్మ, సమావేశమైన పాతిక ముప్ఫయి మందినీ స్పందింప జేసింది. చక్కటి కవితకు కొలమానం ఎప్పుడూ అదేకదా!.... సెక్రటరీ కృష్ణ మూర్తి వందన సమర్పణ గావించగా, ప్రారంభంలో అశోకమిత్రన్ ముగ్గురు కవులనీ పరిచయం చేశారు. తమ తమ వృత్తి వ్యాపకాలలో పై మెట్టు చేరుకు, ఆత్మ నివేదనగా కవితలు వ్రాస్తున్న వారే ముగ్గురూను. వారి కవితా సంకల నాలు అచ్చయాయి: మార్కెట్లో వున్నాయి. ముగ్గురూ 'ఇండొ - ఆంగ్లి యన్ పొయట్స్'గా గుర్తింపు పొందిన వారే!

. . . . . 17

'రేడియో అన్నయ్య రేడియో అక్కయ్యల (న్యాపతి రాఘవరావు, కామేశ్వరమ్మ, చేత స్థాపించబడిన ఆంధ్ర బాలానంద సంఘం యింత వృద్ధిలోకి రావడం నా కెంతో సంతోషంగా ఉంది. ఒక సంస్థ వృద్ధిలోకి రావాలంటే, అంకిత భావం గల వ్యక్తులు అందుకు పూనుకోవాలి," అన్నారు పార్లమెంటు సభ్యురాలు వైజయంతీ మాల బాలి, నూతన నిర్మాణానికి ప్రారంభోత్సవం గావిస్తూ! ఆ స్త్రీ సేవామందిర్, మిసెస్ ఎసి కృష్ణారావు సభాధ్యక్షత వహించారు. కార్యదర్శి డియన్ దాస్ ఆహూతులకు స్వాగతం తెలిపారు.







. . . . . 25

గేదరింగూ పిన్నింగూ అయాక, ఆరుకాపీల పొతక టేబుల్‌మీద పెడ తారు - ట్రిమ్మింగ్ సరిగా వున్నదో లేదో చెప్పేందుకు! ఇటూ అటూ తిర గేసి ఒక కాపీ మేడమీదకి పంపడం అలవాటు. ఆ ప్రకారమే యివ్వాళా పంపాను. అరగంట పోయాక టీ కోసం పైకి వెళ్లినప్పుడు, 'జనవరి పది నాటి పార్టీలో అందరి పేర్లూ చెప్పి పండునీ సరళనీ ఎలా మర్చి పోయావ్?' అని అడిగింది శారద. 'అవును, మర్చి పోయినట్టున్నాను. పొరబాటయింది' - అని తప్పు వొప్పు కున్నాను. 'ఇది చదివాక వారు ఏమను కుంటారు?' అని నిలదీసింది శారద. "మంచి మనసుగల వారిద్దరికీ 'సారీ' చెప్పుకుంటాను" అనే సంజాయిషీతో ఆ ప్రసక్తి ముగిసింది.... 'డైరీ' మేటరు మర్నాడో మూడోనాడో రాస్తే, యిటువంటి పొరబాట్లు దొర్లవు. కాని జనవరి సంగతులు ఫిబ్రవరి మొదటి వారం దాకా వ్రాయడానికి టైము కుదరలేదు. ఒక్కోసారి అలా అవుతుంది. పండూ సరళా మరోలా అనుకోరని మనసా నమ్ముతున్నాను.

. . . . . 27

'మద్రాసు తెలుగు అకాడమీ ఫంక్షన్స్‌కి పత్రికలవారు యిస్తున్న కవరేజ్‌కి మా మనఃపూర్వక ధన్య వాదములు' - అన్నారు సంస్థ చెర్మన్ పి ఓబుల్ రెడ్డి. అధ్యక్షులు బాల మురళీకృష్ణ జాతీయ సమైక్యతకు సంగీత నాట్యాదులే ముఖ్యసాధనాలు - అన్నారు. కార్యదర్శి రావికొండల రావు ఆహూతులకు స్వాగతం తెలి పారు. కన్వీనర్ టివికె శాస్త్రి, మద్రాసు తెలుగు అకాడమీ 1981 నుంచీ చేస్తున్న కృషి గురించి ప్రస్తావిస్తూ, ఈ ప్రమోద నామ సంవత్సరారంభాన జరిగే ఉగాది వేడుకల విశేషాలు తెలిపారు. మద్రాసు మ్యూజిక్ అకాడ మీలో మార్చి 25 ఆదివారంనాడు జరిగే ఉత్సవంలో జి విఠల్ (రిచ్ మాన్ గ్రూప్), కె భగవతీ ప్రసాద్ (స్వరాజ్ మజ్దా), డి బాలకృష్ణ (హైదరాబాద్ టివి), యస్ వేణు గోపాల రెడ్డి (మద్రాసు ఆలిండియా రేడియో) మున్నగువారు ప్రత్యేక అతిథులు కాగా, కేంద్ర సమాచార మంత్రి ఉపేంద్ర అధ్యక్షులు, తమిళ నాడు గవర్నరు అలెగ్జాండర్ ముఖ్య అతిథి, అక్కినేని నాగేశ్వరరావు గౌరవ అతిథి, అన్నపూర్ణ (శ్రీమతి బాల మురళి) ఉత్సవ జ్యోతి వెలిగిస్తారు; స్వాగత వచనం ఓబుల్ రెడ్డి; ముఖ్యు లను బాలమురళీకృష్ణ సత్కరిస్తారు. అపొల్లో పిసి రెడ్డి ఆహ్వాన సంఘా ధ్యక్షులు. వినోద కార్యక్రమం రావి కొండలరావు నిర్వహించగా, పురస్కా రోత్సవం యస్పి బాలసుబ్రమణ్యం. వందన సమర్పణ బియస్సార్ కృష్ణ. మద్రాసు తెలుగు అకాడామీ పుర స్కార గ్రహీతలు పన్నెండుగురు. 1 శాంతి రంగనాథన్ (డ్రగ్‌యడిక్ట్స్ రిహాబిలిటేషన్); 2 వైజయంతీమాల

బాలి (భారత నాట్యకళాభివృద్ధి); 3 లలితా కామేశ్వరన్ (యమ్‌జిఆర్ మెడికల్ యూనివర్సిటీ వైస్ ఛాన్స లర్); 4 భానుప్రియ (టివి సీరియల్ 'విశ్వామిత్ర'); 5 డి కామేశ్వరి (ప్రముఖ రచయిత్రి); 6 రీనా రామ చంద్రన్ (ఒయన్‌జిసి); 7 షావుకారు జానకి (సుప్రసిద్ధ సినిమాతార); 8 అనూరాధా రెడ్డి (క్రీడాకారిణి); 9 యమ్మెల్ వసంతకుమారి (కర్ణాటక సంగీతం); 10 జానకీ వెంకట్రామన్ (జర్నలిస్ట్)! 11 కమలకుమారి (హరి కథ); 12 లలితా పీటర్స్ (వైస్ - ప్రిన్సిపాల్ : క్వీన్ మేరీస్), పురస్కార గ్రహీతలు పన్నెండుగురూ వనిత లవడం ఈ సంవత్సరపు విశేషం....

ప్రముఖుల జ్ఞాపకార్థం ఒకరిపేర మరొకరు యిస్తున్న పురస్కారాలు పదిహేను. గ్రహీతలు వరసగా : 1 బి నాగిరెడ్డి; 2 దాసరి నారాయణరావు; 3 రజనీకాంత్; 4 జేసుదాస్; 5 నాగేష్ 6 కెయస్ ప్రకాశరావు; 7 మణి కృష్ణస్వామి; 8 యస్ రాజేశ్వరరావు; 9 అర్ వైద్యనాధన్; 10 వెంపటి వినసత్యం; 11 షణ్ముఖి ఆంజనేయ రాజు; 12 కె జమునా రాణి; 13 కె మురళీకృష్ణ; 14 అర్‌వి చలం; 15 పేకేటి శివరామ్.... పై ఇరవై ఏడూగాక మరొక పది పురస్కారాలు 1 సి నారాయణ రెడ్డి (జ్ఞానపీఠ్); 2 టి రాఘవన్ (కంపెనీలా); 3 రమేష్ గెల్లీ (వైశ్యాబాంక్); 4 కామిశెట్టి శ్రీనివాసులు (అన్నమయ్య); 5 శామ్యుల్ పాల్ (టివి ప్రొడ్యూసర్);

6 ఐ సత్యమూర్తి (కార్డియాలజిస్ట్) ; 7 యామిజాల పద్మనాభ స్వామి (కవి పండితుడు) ; 8 పి విజయలక్ష్మి (ఒరిస్సాలో టీచరు) ; 9 కమలహాసన్ ('పద్మశ్రీ') ; అల్లు రామలింగయ్య ('పద్మశ్రీ').... పంచాంగ శ్రవణం, ఆశీర్వచనం, అభినయం, ఆంగికం (ప్రియాదీక్షిత), సాహితీ వసంతం ; మొనొలోగ్ (గుమ్మడి-షావుకార్ జానకి - జయప్రద) ; హాస్యం (నాగేష్) ; ఎందరో చుట్టాలు - హాస్యనాటక ; 'కవల లవల' తమాషా పోటీ యిత్యాదులు వుంటాయి. ఈ బృహత్ కార్య క్రమానికి టికెట్లు లేవు. ప్రవేశపత్రానికి, కార్యదర్శి : మద్రాసు తెలుగు అకాడమీ, 25 మెలోనీ రోడ్, త్యాగరాయనగర్, మద్రాసు - 600017, అడ్రసుకి వ్రాసి పొందవచ్చు. హాలులో స్థలం వున్నంత మేరకు, మొదటి అడిగిన వారికి మొదట యివ్వడం పద్ధతిగా, ప్రవేశపత్రాలు అందజేస్తారు. కార్డు లేనిదే లోనికి పంపరు, అంచేత, ముందే జాగ్రత్తపడటం మంచిది.

—యన్నార్ చందూర్



స్త్రీ పురుషుల మనస్తత్వంలో తేడా ఎక్కడంటే, పురుషుడు తనకి కావల ...న రూపాయి వస్తువుని రెండు రూపాయిలిచ్చి అయినా కొంటాడు ; స్త్రీయేమో తనకి అక్కర్లేని రెండు రూపాయల వస్తువుని రూపాయికి కొంటుంది.

—విలియమ్ బింజ్

# ముఖచిత్రం



తంజావూరు జిల్లా మారుమూల గ్రామంలో, తమ ఇంటి ముందు తెర కట్టి నాటకం వేసిన బాలుడు, అన్నామలైలో విద్యార్థి. మద్రాసు అకవుంట్ జనరల్ ఆఫీసులో క్లర్కుగా పని చేసి, 1965 లో ఈ వెండితెర ప్రపంచాన ప్రవేశించి, వెనుదిరిగి చూడటమనేది లేకుండా, ముందుకే, ముమ్ముందుకే సాగుతున్నాడు. రాగిణీ రిక్రియేషన్స్ ద్వారా రంగస్థలానుభవం, ఆధునిక నాటక రచనా పాటవం అపారంగా కలిగిన కెబి, కాన్సర్ రోగి చిత్రంతో సంచలనం కలిగించారు. సందేశాత్మకంగా ఉంటూ, జనామోదం పొందటం ఈయన చిత్రాలలోని ప్రత్యేకత. భామా విజయం (67), ఎదిర్‌నీచల్ (68), పున్నగై (71), మేజర్ చంద్రకాంత్ (66), అరంగేట్రమ్ (73), తౌడర్ కథై (74), అవర్‌గళ్ (76), మరో చరిత్ర (78), ఇరుకోడుగళ్ (70), మన్మథలీల (78), సింధుభైరవి (85), తన్నీర్ తన్నీర్ (81), అచ్చమిల్లెయ్ అచ్చమిల్లెయ్ (84), అగ్నిసాక్షి (82), రుద్రవీణ (88), అపూర్వ రాగంగళ్ (75), .... ఇవి దక్షిణ భారతంలోనే కాదు, ఇండియన్ ఫిలిమ్ ఇండస్ట్రీలో మైలురాళ్లు కావని ఎవరనగలరు ? సినీ మీడియమ్ ద్వారా ప్రజలను చైతన్యవంతులు చేయగల విధ్య ఆయనిది ఈ సంవత్సరం ఛాంబర్ అధ్యక్షులు. 

# నా చిన్ననాటి ముచ్చట్లు

## కెయన్ కేసరి



డా॥ కెయన్ కేసరిగారు ఆదర్శ ప్రాయమూ ఫలవంతమూ అగుజీవితం, మానవ సేవా తత్పరతతో గడిపారు వీరేశలింగం గారి వల్ల ప్రభావితులై స్త్రీజనోద్ధరణకు అనేక విధాల కృషి చేశారు. బెంగుళూరు బంగాళా అమ్మడం వల్ల కలిగిన మనోవ్యాకులత చల్లా రేందుకు 'కేసరీ విద్యాలయం' స్థాపించారు. కేసరిగారు అంటారు తమ ముచ్చట్లలో : ఈ కాలమున పెండ్లిండ్లలో వధూవరులకు క్షౌరపు సామానులను, తోలు సంచులను చదివించుట పరిపాటియైనది. వీరేశలింగం గారికి పూర్వము విలువగల వస్త్రములు, ఆభరణములు కట్నములుగ చదివించుట ఆచారము. శ్రీ వీరేశలింగం గారు నాటిప్రజలలో వెలిగించిన విజ్ఞాన ప్రబోధ ఫలితముగా, పలువురు వారి గ్రంధ రాజములనే కట్నములుగా, వధూవరులకు చదివించుచుండిరి. .... ఇది ఏనాటి మాట ? 1904. మనం ముందుకు వెళ్తున్నామా, వెనక్కి వెళ్తున్నామా ?.... 1989 జులై నుంచి ధారావాహికంగా వెలువడుతున్నాయి 'ముచ్చట్లు'.

"నంబూదిరీ బ్రాహ్మణులకున్నూ, తెలుగు బ్రాహ్మణులకున్నూ చాలా సామ్యములున్నవని చెప్పబడుచున్నవి; అనగా ఇంటిపేరు, మొక్కట్లు, కృత్రిమ మెరుగని ఖండిత పదవైఖరులు, వేదపారాయణ కౌశలము, తోటలందు గృహములు నిర్మించుకొని నివసించుట, గృహనిర్మాణము, స్త్రీలుధరించు వస్త్రములపద్ధతి, సంగీతకమందభి రుచిలేమి(?) ఇత్యాదులు," (654పు)

వీనినన్నిటిని మనము అంగీకరింపకున్నను ముఖ్యముగా - ఒక్కమాట తోచుచున్నది. ఆర్యుల తొలినాటి మాతృపూజ తెలుగుదేశమునకు వచ్చిన పిదప కూడ చాలాకాలము విడువలేదు; మళయాళమున నేటికిని అది విడువబడలేదు.

కేరళదేశము పుణ్యభూమి యనిచెప్పియుంటిని. అందుకు కారణములు ఇక్కడి యీ పుణ్యక్షేత్రములు :

తిరువనంతపురమున అనంతపద్మనాభస్వామిని గురించి నేనిదివరకే వ్రాసియున్నాను.

## కన్యాకుమారి - మరికొన్నివిశేషములు

ఉత్తర దేశమున కాశీక్షేత్రమెట్లు పుణ్యభూమిగ నున్నదో అటులనే దక్షిణదేశమున కన్యాకుమారి పుణ్యభూమిగ నున్నది. ఈ జగన్మాతప్రభావమును జనులు వేయినోళ్ల పొగడుచుందురు. ఈ లోకేశ్వరి తన భక్తశిరోమణియగు పరశురాముని ఆజ్ఞానుసారమున సాధువులను రక్షించుటకు సాగరతీరమున వెలసియున్నది. ఈ దివ్యతేజస్విని దివ్యస్వరూపమును దీపారాధన సమయము నందు దర్శించి తృప్తిచెందవలయును. దేదీప్యముగా ప్రకాశించుచుండు కళ్యాణి ముఖారవిందమును దర్శించిన పుణ్యాత్ములకు పునర్జన్మము కలుగదని పెద్దలు చెప్పెదరు. ఈ దేవి ఇక్కడనుండి నవతీర్థముల మధ్య వెలసియున్నది - సావిత్రీతీర్థం, గాయత్రీతీర్థం, సరస్వతీతీర్థం, కన్యాతీర్థం, వినాయకతీర్థం, మాతృతీర్థం, పితృతీర్థం, సర్వతీర్థం, భీమతీర్థం అను నీ 9 దియు నా తీర్థములు.

## శుచీన్ద్రం - ప్రాముఖ్యము

ఈక్షేత్రమునకు శుచీన్ద్రం అను పేరువచ్చుటకు కారణం గలదు. దేవేంద్రుని శాపవిమోచనమునకు ఈ క్షేత్రనాధుడగు స్థాణుమాలయమూర్తి అనుగ్రహమును బడసి పాపవిముక్తుడాయెను. ఇంద్రుని శుచిచేసిన క్షేత్రము

గనుక శచీన్ద్రమని పేరుపెట్టిరట. ఇప్పటికిని దేవేంద్రుడు దేవలోకమునుండి దేవాలయమునకు వచ్చి ఒక యామము పూజించి పోవుచుండునని అక్కడి పూజాచారి చెప్పుచుండును. ఈ దేవాలయపు గాలిగోపురము మండపముల శిల్పచాతుర్యము మధురదేవాలయమును పోలియుండును. ఇక్కడ యాత్రీకుల సౌకర్యమునకు సర్కారు సత్రము గలదు. ఇది తిరువనంతపురం మహారాజు వారి పరిపాలనలోనే యున్నది.

## శబరి ఆశ్రమం

శ్రీ రామచంద్రమూర్తి పంచవటిని వదలి శబరిఆశ్రమమునకు వచ్చెను. ఈ శబరి ఆశ్రమము తిరువనంతపురమునకు సుమారు 160 మైళ్లదూరమున నుండు మహారణ్యమున శబరిపర్వతం మీద నున్నది. ఈ శబరిపర్వతము మీదనుండు అయ్యప్పన్ అనుదైవము హరిహరాదులకు పుత్రుడు. విష్ణుమూర్తి మోహినీ రూపమును దాల్చి శివుని మోహింప చేసినప్పుడు వారిరువురకు పుట్టిన దేముడని స్థళపురాణము చెప్పుచున్నది. ఈ క్షేత్రమున ప్రతి సంవత్సరము కేరళదేశమునుండి వేలువేలుగా జనులు శబరికొండనెక్కి అయప్పను పూజించి వచ్చుచుందురు. శబరి ఆశ్రమమునకు పోవు భక్తులందరు నీలి వస్త్రములను ధరించి విభూతిరేఖలను దట్టముగ దిద్దుకొని చేత త్రిశూలములను ధరించి శివగీతములనుపాడుచు శబరికొండ నెక్కెదరు. ఇది అరణ్యమగుట వలన దోవ డొంకలుండవు. కాలినడకనే పోవలయును. అడివికట్టెల దివిటీలతో రాత్రివేళ నడిచెదరు. ఈ దివిటీలవెలుతురుకు పాటల శబ్దమునకు అడవిమృగములు వీర్లను చేరరావు. గుంపులు గుంపులుగా పోవుచుందురు గనుక నిర్భయముగను ఉల్లాసముగను ఈ యాత్రకు పోయివచ్చెదరు.

ఆశ్రమముచుట్టును పంపా సరోవరము, ఋష్యమూక పర్వతము, నీలాద్రి, శ్రీ రామవనం మొదలగు పురాతన పవిత్రక్షేత్రములు గలవు. ఈ స్థలము లన్నియు ఈ పేర్లతోనే యిప్పటికిని యున్నవి - (ఇచటివారైతే ఆ యాత్ర ప్రదేశములతో రామాయణ గాథకు సంబంధము కల్పించుకొని యున్నారు. గోదావరిలో శబరియను ఉపనది కలియుచున్నది. కాని బళ్లారి ప్రాంతమున ఋష్యమూకపర్వతాలు కలవని చెప్పుకొందురు.)

## మారుతి పర్వతం

అనగ హనుమంతుని కొండ. దీనిని మళయాళములో మరుత్వామలై అందురు. హనుమంతుడు మృతసంజీవి కొరకు సంజీవి పర్వతమునకు పోయి

వాయువేగ మనోవేగములతో వచ్చునప్పుడు చేతనున్న సంజీవి అణుమాత్రము ఈ కొండమీద పడి, అప్పటినుండి అక్కడ అమూల్యమైన ఆయుర్వేద ఓషధిరాజములు పుట్టుటవల్ల ఈ కొండకు మారుతిపర్వతమని పేరువచ్చినది. భక్తాగ్రేసరులు భజన సలుపుచు భగవంతుని ధ్యానించుటకు ఈ కొండ చాల అనుకూలముగ నుండును. మలయమారుతము, నిర్మలోదకములు ఇక్కడ సమృద్ధి. ఆహారము దొఱుకును. క్రిందనుండి ఒకమైలుదూరము కొండ యెక్కిన అక్కడ శివక్షేత్రము కలదు. పుష్కరిణియును కలదు. వేసవి కాలమున శ్రమతీర్చుకొనుటకు విశాలమైన వటవృక్షము లున్నవి. వచ్చి పోవువారికి వసతిగృహము లున్నవి.

యోగాభ్యాసము చేసుకొనువారికి యోగమంటపమును నల్లరాతితో రమ్యముగ కట్టబడి యున్నది. యోగీశ్వర్లు నివసించుటకు పెద్ద మందిరముకూడ కట్టబడి యున్నది. ఈ వసతులన్నియు తిరువనంతపురం మహారాజు యేర్పాటు చేసినవి.

## అల్వాయి నది

మారుతిపర్వతమునుండి వర్షకాలమున ఓషధుల సారము అల్వాయిలో పారు పెరియారు నది ద్వారా కొట్టుకొని వచ్చును. ఈ కారణమున అల్వాయి నదీస్నానము అనారోగ్యులకు అనుకూలముగ నున్నది. వేసవికాలమున దూర దేశముల నుండి కూడ రోగవిముక్తులగుటకు ఇక్కడికి వచ్చి సుఖముగ వెళ్లుదురు. ఈ పట్టణము తిరువనంతపురము సంస్థానమునకు చేరినది. ఇక్కడ గొప్ప కర్మాగారములు, విద్యాలయములు గలవు. ఈ రైలు స్టేషను తిరుచూరుకు యెర్నాకులమునకు మధ్యనున్నది.

## సహ్యాద్రి

ఈ పర్వతాగ్రమున పరశురాముడు తపస్సు చేసుకొను నప్పుడే కేరళ రాజ్యమును సృష్టించెను.

## త్రిప్రయార్

త్రిప్రయార్ అను పేరుగల శ్రీరామచంద్రమూర్తి క్షేత్రము తిరుచూరుకు 14 మైళ్ల దూరమున నున్నది. ఈ క్షేత్రము కొచ్చి రాజ్యమున చాలా ప్రసిద్ధక్షేత్ర మగుట వలన నేనిక్కడికి వెళ్లి శ్రీరాముని దర్శించి రావల

యుననే కోరిక యుండెను. ఆంధ్రదేశమున భద్రాద్రి యెటుల ప్రసిద్ధమో ఈ దేశమున త్రిప్రయారు అటుల ప్రసిద్ధముగ నున్నది. ఇది యొక నదీతీరమున నున్నది. గొప్ప ప్రహరీగోడలు యెత్తయిన మంటపములుగల విశాలమైన దివ్య క్షేత్రము. అతి పరిశుభ్రముగ నుండును. రాముడు లంకాధిపురిని వధించి, తిరుగ వచ్చునపుడు ఈ నదీతీరమున విశ్రమించినట్లు స్థలపురాణము గలదు.

శ్రీరామచంద్రమూర్తి సీతాసమేతుడుగ నుండు దృశ్యము ఈ గర్భగుడి యందు కాననగును. గాంభీర్యమైన విగ్రహములు. గర్భగుడి నిండుగ అఖండ జ్యోతులు వెలుగుచుండును - అర్చనలు దీపారాధనలు సదా జరుగుచుండును. ముఖమంటపమున నంబూదిరీ బ్రాహ్మణులు వాల్మీకిరామాయణమును పారాయణము చేయుచుందురు. నది ఒడ్డున స్నానఘట్టము, మలిచిన నల్లరాళ్ళతో కట్టబడియున్నది - ఇక్కడి విశేషమేమనగా పురాతనమునుండి నదీఘట్టమున వివిధరకములుగా మత్స్యములుండును. యాత్రికులు వాటికి దంపుడు బియ్యమును ఆహారముగ వేయుదురు. ఈ దంపుడు బియ్యమును దేవాలయము నందే విక్రయింతురు. బియ్యమును తిని ఈమత్స్యములు తెగబలిసియుండును. నీళ్ల ఒడ్డున నిలుచుండి పిలిచిన, గుంపులు గుంపులుగా వడ్డు వద్దకు వచ్చును.

తిరుచూరుకు సమీపమునే యున్న గురువాయూరు అను ప్రసిద నారాయణ క్షేత్రమును గురించి యింతకుముందు వివరించినాను.

ఇంకను అనేక పుణ్యక్షేత్రములు ఈ రాజ్యమునందు గలవు.

కొచ్చి రాజ్యమునకంతయును గొప్ప శివాలయము వడకన్నాథక్షేత్రము తిరుచూరు నందున్నది. తిరుచూరుకు సమీపముననే గురువాయూరునందు శ్రీ మహావిష్ణువు వెలసియున్నాడు.

ఈ దేవాలయములన్నియు తెల్లవారి 4 గంటలు మొదలు రాత్రి 10 గంటలవరకు ధూప దీప నైవేద్యములతో కళకళలాడుచుండును. తిరువనంతపురం కొచ్చి రాజుల పరిపాలన క్రింద వుండుటవలన దినచర్య చక్కగ జరుగుచున్నది. తిరువనంతపురం రాజు పద్మనాభుని దాసుడు. కొచ్చిను మహారాజు వైదికశిఖామణి, దేవాలయములో జరుగు వుత్సవాదులకు వీరు హాజరగుచుందురు. నిరాడంబరముగా రాజ్యపాలన చేయు మహాపురుషులు వీరు.

# 16. బెంగుళూరు పరిచయము

శాస్త్రి

బసవనిగుడివీధిలో ఒక పెద్దతోటగల బంగళాను తీసి, తోటను అనేక విధములుగ పెంచితిని. క్రమముగ దానిని పుష్పవనముగమార్చి ప్రతి సంవత్సరము ఆయూరిలో సర్కారు తరుపున జరుగు తోటల పోటీపరీక్షలలో పాల్గొనుచు నా తోటకు మంచి బహుమానములను ప్రతియేటా పొందుచుంటిని. ఇక్కడ మందుల ఫ్యాక్టరీని పెట్టి మైసూరు రాజ్యమున కంత మందును పంపు చుంటిని. అక్కడ యుండుటవలన, మైసూరులో పరిచయముగలవాడనై పట్టాభిషేకమునకు, రాజుగారి వివాహమునకు మంచిబహుమతులను పొంద గలిగితిని. యుద్ధకాలమున బెంగుళూరు యింటికి మంచిధర వచ్చినందున విక్రయించితిని. నాయిల్లు విక్రయించిన పిమ్మట నేను బెంగుళూరుకు పోయినప్పు డెల్లను శాస్త్రిగారింటనే బసచేయుచున్నాను. శాస్త్రిగారు యిటీవల మంచియిల్లును విశ్వేశ్వరపురమున కట్టించిరి. వీరుయిప్పుడు మంచి ధనికులయినను కేసరి కుటీరమును మరిచిపోకుండ ఏజంటుగానే యిప్పటికిని పనిచేయుచున్నారు. ఆంధ్రులు బెంగుళూరుపోయినప్పుడు శాస్త్రిగారి హొటలులోనే బసచేసెదరు. వీరు ఆంధ్రులు. ములికినాటివారు. తెలుగువారికి కావలసిన పచ్చళ్లు, ఆవకాయ మొదలగునవి వీరి హొటలులో వడ్డించెదరు.

## పుష్పవనం

(Ornamental Flower Garden)

' Man is very near to God in a garden than anywhere else on earth'' అనగా మానవుడు అన్నిటి కంటెను పుష్పవనమున ఈశ్వర సాన్నిధ్యమునకు చాలదగ్గిరగ నుండగలడని. మనము సాధారణముగ ఇంటి తోటలలో భక్షణపదార్థములను మాత్రము వేసుకొని, పెంచి, వాటి ఫలములను అనుభవించు చుందుము. అయితే పుష్పవనమును గూడ మరవరాదు. పుష్పవనమున గృహము నిర్మించుకొని నివసించిన మనుజుడు హాయిగ దీర్ఘ జీవితమును సంపాదించుకొనగలడు. ఈ పూదోట నిర్మాణమునకు ముఖ్యముగ స్త్రీలు దగినవారు. స్త్రీలకు పుష్పముల మీదయుండు ప్రేమ, వెలగల నగల మీదను చీరెలమీదను కూడ యుండదు: ఈవిషయము ప్రతిస్త్రీకిని దెలియును.

పూదోట వినోదమునకేగాక ఆరోగ్యభాగ్యమునకును మానసిక వ్యాధుల కును మంచిమందు. ప్రాతఃకాలమునలేచి, సుగంధపుష్పముల చెట్ల నడుమను లతాగృహములలోను సంచరించునపుడు వీచు ఆ మందమారుతము వలన గలుగు బ్రహ్మానందమును వర్ణించుట యెవరితరము? సుగంధపుష్పరాజమును ఆఘ్రాణించుట వలన కలుగు 'మనోహర' మను మందు మనోవ్యాకులములను మాయము చేయును. పూదోటలో పూదేనియకు విచ్చలవిడిగ విహరించు భృంగముల మధురగీతములు వీనులకు విందొనర్చుచుండును. తేనెటీగలు పూదేనియను త్రాగి, తేనెగూటిని కట్టుకొను చిత్రమును చూచి సంతోషింప వచ్చును. రంగుపక్షులు రామచిలుకలు ఫలవృక్షములకు తోటలో పాకులాడుట చూడవచ్చును. వంటరిగ నుండునపుడు పూలచెట్టువద్ద కూర్చుని దానికి శుశ్రూషచేయుచు స్నేహమును సంపాదించుకొని కాలమును శాంతముగ గడప వచ్చును. అనేకులు ఆత్మశాంతికై ఆరామక్షేత్రముల నాశించెదరు. వేయేల, ఆరామమునకు మించిన ఆత్మబంధువులు వేరుగనుండరని చెప్పవచ్చును.

కావుననే మహర్షులుకూడా ఇహలోకసౌఖ్యముల విడచి అడవులలో తపస్సు చేసుకొనుచున్నను పుష్పవనమును కేవలము దయాహృదయులై పెంచుదురు. బహుశా ఆ పుష్పవనము శోభ — హరి శమరమములను పెంపొందించుచుండునేమో.

కణ్వమహర్షికి వనలతావృక్షములపైగల ప్రేమాతిశయమును కాళిదాసు మనోహరముగ రూపించినాడు.

శకుంతలయు, చెలికత్తెలగు ప్రియంవద, అనసూయలును పూలచెట్లకు నీరు పోయుచు ఇట్లు ప్రసంగముచేసిరి :—

"అనసూయ :- శకుంతలా కాశ్యపతాతకు, నీకన్నా ఈ ఆశ్రమవృక్షాలు ప్రియతరములా? - అని యోచిస్తున్నా. ఏమంటే, నవమల్లికాపుష్పముకన్నా కోమలమైన నిన్నుకూడ, ఈచిన్నచెట్లకు నీరుపోయమని నియమించాడే?

శకుంతల :- కేవలం తాత చెప్పేడనేకాదు; వీనియందు నాకు సోదరీ స్నేహంకలదు కూడా."

ఎంత సోదరీ స్నేహం లేకపోతే - అత్తవారింటికి పోతూ శకుంతల - వనజోత్స్న అనే లతను కౌగలించుకొని, వెళ్లను అనుజ్ఞ యిమ్మని కోరుతుంది?

ఆమె ప్రయాణ సమయాన కణ్వుడు వనదేవతలను ఆమెకు అత్తింటికి వెళ్లను ఆజ్ఞయిమ్మని కోరుతాడు. వనదేవతలున్ను అంగరాగములు, ఆభరణములు ఇచ్చి ఆమెను సాగనంపుతారు.

సౌకుమార్యము స్త్రీలకు ఉత్తమలక్షణము. ఆ సౌకుమార్యములో శ్రేష్టమైన దానిని - శాస్త్రకారుడునిర్వచించుచు, "ఏ స్త్రీయైతే పువ్వు తనవంటికి తాకినా ఓర్చుకోలేదో, ఆమెది ఉత్తమ సౌకుమార్యం" అన్నాడు. అందుచేతనే కాబోలు - స్త్రీలు పుష్పాలను హెచ్చుగా మన్నిస్తారు; రసహృదయులైన పురుషులున్నూ, ఆ స్త్రీలనూ, పువ్వులనూ పూదోటలనూ సేవిస్తారు.

## నా తోట

నాకు చిన్ననాటినుండియు తోటపని యనిన అమిత ఆశ. నేను మా గ్రామములో యున్నప్పుడు కూడా మాపూరింటి చుట్టును కాకర, పొట్ల, చిక్కుడు చెట్లపాదులను, మల్లెచెట్లను. సన్నజాజిచెట్లను, తీగెసంపెగను, జామచెట్టును, జడపత్తిచెట్లను వేసి పెంచుచుంటిని, కొత్తిమిర పాదును, వంగ మొక్కలను, మెరపనారనువేసి యేటి నుండి కావడితో నీరుతెచ్చి వాటికిపోసి పెంచుచుంటిని పెరుగు తోటకాడలను పెంచుచుంటిని. ఈ చెట్లకు పెంటదిబ్బ మన్నును వేసిబలపరచుచుంటిని. ఈ విద్య నాకు చిన్నప్పటినుండియు అలవడినదే. ఇది మా వూరిలో నేర్చుకున్న విద్య. నేను ప్రయోజకుడనైన పిమ్మట బెంగుళూరు యింటిని కాళీస్థలము కొన్నప్పుడు యింటిచుట్టు దట్టముగ మామిడిచెట్లు, కొద్దిగ టెంకాయచెట్లు మొదలగునవి మాత్రమే యుండెను. నివసించుయింటిచుట్టు మామిడి చెట్లుండుటచే దోమల బాధను సహింపజాలకుంటిమి. మామిడిపండ్ల కాలములో సన్నదోమలు పగలుకూడ కండ్లలోకిపోయి బాధించుచుండెను. ఇందువలన కండ్లకలక వ్యాధి కూడ వచ్చుచుండెను. ఈకారణమువలన యింటి సమీపమున నుండు కొన్ని మామిడిచెట్లను మాత్రము కొట్టివేయవలసి వచ్చెను. ఫలించు ఫలవృక్షములను నరికివేయుటకు మనసొప్పకపోయినను చేయక తప్పదాయెను. ఇంటివద్ద నుండు మామిడిచెట్లను కొట్టివేయగనే నివసించు యింటిలోనికిమంచి వెలుతురు, గాలి, యెండ ప్రవేశింపదొడగెను. అప్పుడు బాధించుచుండిన దోమలు మాయమాయెను.

బెంగుళూరు పట్టణము మంచి పూదోటలను వేసి పెంచుటకు అనుకూలమైన వాతావరణము గలదగుటచే అనేకులు వార్లయిండ్లచుట్టు పుష్పవనము ఫలవృక్షములను వేసుకొని ఆనందించుట నేను చూచితిని. ఆ తోటలను చూచి నప్పటినుండియు నాకును అటువంటితోటలను పెంచవలయుననే కోరిక కలిగెను.

ఈ కోరిక కలుగగనె బెంగుళూరు లాలబాగ్ లో ఉద్యానసంఘమున సభ్యుడనైతిని. ఆ సం
సభ్యులందరియిండ్లకు గార్డన్ సూపరిండెంటువచ్చి, తోటను యేవిధముగ వేయవలసినది మార్గములన్నిటిని బోధించుచుండెను. నేనావిషయములన్నిటిని శ్రద్ధగ నేర్చుకొని నా తోటను వేయుటకు ప్రారంభించితిని.

నాయింటి ముఖద్వారము తూర్పుదిశను చూచుచుండును. చలిదేశమగు బెంగుళూరునందు ప్రాతఃకాలమున సూర్యభగవానుడు మాయింటప్రవేసించి మమ్మానందింప చేయుచుండెను. ఇంటివాకిటి కెదురుగ విశాలమైన నలచదరపు ఖాళీస్థలముండెను. ఆ స్థలపు మూడుదిశల ప్రహరిగోడలప్రక్కన గోడ కనుపడకుండునట్లు మూడువరుసల పూలచెట్లను వేయించి పెంచితిని. మొదటివరుస వంటిరెక్క (Single) దాసాని పూలచెట్లను, రెండవవరుస ముద్ద (Double) పువ్వుల దాసాని పూలచెట్లను, మూడవవరుస కాశీతుంబ (Balsam) చెట్లను వేసితిని. ఈ మూడువరుసల పూలచెట్లు పూచినప్పుడు పూచిన పూలమెట్లవలె కాన్పించును. మొదటివరుసచెట్లు పొడవుగ పెరుగును. రెండవవరుసచెట్లు పొట్టిగ గుబురుగ పెరుగును. మూడవవరుస బాల్సం పూలచెట్లు ఒక అడుగు పొడవున మాత్రమేపెరిగి దట్టముగ పూలుపూయును. ఈ దృశ్యము కనులపండువుగ నుండును.

ఈ కడపటి పూలచెట్లు వరుసనుండి 10 అడుగుల మోటారురోడ్డును వేయించితిని. ఈరోడ్డు ప్రక్కననే పొట్టిబంతిచెట్లను (French Marigold) నాటించితిని. రెండవ వరస ఫ్లాక్సన్సు విదేశ పూలచెట్లవరుసను వేయించితిని. ఈ రెండువరుసల పూలమధ్యను విశాలమైన లాన్ (Lawn)యని పిల్వబడు గడ్డినేలను తయారుచేయించితిని. ఇది చూచునప్పుడు ఏలూరు రత్నకంబళివలె కాన్పించును. ఈ రత్నకంబళి నాల్గు మూలలను సైప్రస్ చెట్లను పెంచితిని. ఈ చెట్లు శాఖలులేక పచ్చగ గుబురుగ 50 అడుగుల వరకు పెరిగినవి. ఈ చెట్లను తలయెత్తిచూచినపుడు తమాషగ నుండును.

ఈ సైప్రెస్ చెట్లప్రక్కననే నాలుగు మూలలను సిమెంటుతో తయారు చేయబడిన అందమైన పెద్దపూతొట్లను కట్టించి అందులో వెర్బీనా (Verbeena) యను తీగపూల చెట్లును నాటితిని. ఈచెట్టు పూచినప్పుడు తొట్టి కనబడకుండ చిక్కగపూయును. తీగనిండుగ పూలుపూచి వ్రేలాడునపుడుచూచిన చాలా అందముగ కనుబడును. ఎఱ్ఱ బిగోనియా (Bigonia) చెట్లతీగెలను సైప్రెస్ చెట్ల నాలుగింటికిని తోరణముగ అల్లించితిని. అవిపూచినపుడు నాలుగుప్రక్కలను రక్తవర్ణపు పూలతోరణముగ కనబడును. ఈ గడ్డినేల (Lawn) మధ్య సిమెంటుతో గుండ్రముగ నీళ్లతొట్టిని కట్టించి దానిమధ్య పూలకొళాయిని నిర్మిం

చితిని. ఈకొళాయి తిరుగునపుడు పూలవర్షము కురిసినట్లు, చక్రాకారముగను, పద్మాకారముగను నీళ్లను చిమ్ముచుండును. నీళ్లతొట్టిలో తామరపూల తీగెలను పెంచి పూలుపూయించితిని. ఈపూలమధ్య బంగారురంగు, వెండిరంగు, ఎఱ్ఱ రంగుగల చేపలను తెచ్చి విడిచితిని. ఈరంగుచేపలు నీళ్లలోయాడునపుడు తళతళయని మెరయుచుండును. ఇంటిముఖద్వారపు మెట్లమీద డాలియా (Dhalia) యను పూలచెట్లను పెద్దతొట్లలోవేసి ప్రదర్శనమునకు పెంచితిని. ఈ చెట్లనుపెంచుట అంతసులభమైన కార్యముకాదు. మంచియెరువు, శుశ్రూష కావలయును. ఈచెట్టు సుమారు 4, 5 అడుగుల యెత్తువరకు పెరుగును. పువ్వువెడల్పు 5,6 అంగుళములవరకు యుండును. అనేకరంగులతోపూయును. పూచినపువ్వు బంతిపూవువలెయుండును. ఇది నిర్గంధ కుసుమము. ఇంకను వాకిటిముందర జినియా, కాస్మాస్, కలియోప్సిస్, పిటోనియా, ఫ్లాక్సుఅను పలువిధములయిన పరదేశపుపూలజాతుల నుంచితిని. బంగళాచుట్టుయుండు కిటికీలవద్ద రాత్రిరాణి (Night Queen) మల్లె, మొల్ల, జాజి మొదలగు సుగంధపుష్పజాతులను వేసిపెంచితిని. రాత్రిళ్లు యీ పూలు వికసించి యిల్లంతయు అత్తరుబుడ్లు విరిగిపోయినట్లుగ వాసన విసురును. ఇంటియిరుప్రక్కలను మాలతి, మాధవిలతాగృహములను నిర్మించితిని.

ఇంటివెనుక భాగమున ఆస్ట్రేలియాజాతి ఆపిల్ పండ్లచెట్లను, అంజూరు [Figs] పండ్లచెట్లను, అలహాబాదు జామపండ్లచెట్లను, మేలయిన బొప్పాయి మొదలగు ఫలవృక్షములను వేసితిని. అవికాచి ఫలములు పక్వమునకురాగానే రాత్రిళ్లు తోటలో చిలుకలు, పక్షులుప్రవేశించి భక్షించుచుండును. మదురుగోడలనుదూకి దొంగలుకూడ రాత్రిళ్లు అపహరించుకొని పోవుచుందురు. కాయకూరలను వెనుకబాగముననే వేయుచుంటిని. ఇక్కడపెంచిన వంకాయలు టెంకాయలంతేసియుండును. ఈ నల్లవంకాయలు బజ్జికి బాగుండును. పాలబెండకాయలు సుమారు 1 అడుగువరకు పెరుగును. కొత్తిమేరాకు, తోటకూర వగైరాలు అతికోమలముగ యెత్తుగపెరుగును. ఈ వూరికూరగాయలు కంటికి బాగుండునే గాని రుచితక్కువ. కాయకూరలరుచికి వంగవోలు ప్రాంతములలో మెట్టవ పండునవియే శ్రేష్ఠము. బెంగుళూరులో విక్రయించు వంకాయలు చేదుగనుండును. పెద్దకాకరకాయలు తియ్యగనుండును. ఇందుకు కారణము కృత్రిమ యెరువులతో కాయకూరలను పెంచుటయే.

ఇంటి వెనుకబాగముననే ఔషధములను తయారుచేయు కర్మాగారమును [Factory]. అతిథులగృహమును, ఆఫీసును వేరువేరుగా కట్టించితిని. ఈ మందిరములకు యెదుట పందిళ్లువేయించి నల్లతెల్లద్రాక్షతీగెలను అల్లించితిని.

ఈ ద్రాక్షపండ్లు బాగుగకాయుచున్నందున మేము తనివితీరతిని యితరులకుకూడ పంచిపెట్టుచుంటిమి.

ఈతోటలో యొకభాగమున అశ్వత్థవృక్షము, వేపచెట్టు కలిసియుండెను. ఆ చెట్లు క్రింద నాగ ప్రతిష్ట కలదు. ఆ చెట్టుచుట్టు నల్లరాళ్లతో అరుగును కట్టించితిని. ఆదివారమునాడు ఆ దేవుని పూజించుచుంటిమి. అప్పుడప్పుడు అక్కడకూర్చుని విశ్రాంతి తీసుకొనుచుంటిమి. మరియొకబాగము చంపక పుష్పముల వృక్షముండెను. ఈ మాను సంపెగచెట్టుక్రింద సిమెంటుతో రెండుఅరుగులను కట్టించితిని. ఉదయమున కొంతకాలము తోటలోతిరిగి, ఆ యరుగులమీద అలసటతీర్చుకొను అలవాటు. ఈ సంపెగచెట్టుక్రిందనే వచ్చినవారితో ముచ్చట లాడుచుండువాడను. ఈ చెట్టు పూచినప్పుడు ఈ చెట్టునీడను విడిచిపోవుటకు మనసొప్పకుండెడిది. ఈ నీడను నేనెట్లుమరువ గలను ?

తోటలో మంచి మామిడిచెట్లుండెను. పీతర్ (రసపురి) గోవా (బాదామి) మల్‌గోవా, అవకాయ పెట్టుకొనుటకు పుల్లటికాయలు మొదలగు మామిడిజాతులుండెను.

పనసపండ్ల చెట్టుండెను. ఆ పనసతొళలను విరిచిన కొబ్బరివలె విరుగును. చక్కెరతో సమానమైన రుచిగలది. ఈపనసపండుతో పాయసమును, హల్వాను తయారు చేసుకొనుచుంటిని. కాయ లేతతొళలతో వరుగులు వేయించుకొని నిల్వచేసుకొనుచుంటిమి. నేలకుతగులు టెంకాయగెలలచెట్టు, దాహముదీర్చు యెళనీరు టెంకాయచెట్లు, కొళంబొజాతి పెద్దటెంకాయచెట్లు మొదలగునవి తోటలోనుండెను. ప్రత్యేకముగ చెప్పదగిన వెలగపండ్ల చెట్లుండెను. తెల్లవారగనే ఆ చెట్టుక్రిందికి పోయినప్పుడెల్లను వెలగపండు లభించుచుండెను. కపిత్థం సర్వదా పథ్యమనుటవలన అపండునంతయు నేనె తినుచుంటిని. మామిడిచెట్లకు పచ్చిమిరియముల తీగెలను అల్లించితిని. ఆ పచ్చిమిరియములనుకోసి నిమ్మపండు, వుప్పుతోకలిపి వూరనిచ్చిన, అరోచకమునకు మంచిమందు.

రోజాపూలచెట్లను పెంచుటకు బెంగుళూరు మంచిస్థలము. అనేకరకముల రోజాపూలచెట్లను తెచ్చినాటితిని. ఈవూరి తీగెరోజాచెట్టు ప్రశస్థమైనది. దీనిని పందిరి మీద అల్లుబెట్టిన అందముగనుండును. ప్రతిదినం గంపెడు పూలను కోయుచుంటిమి. మా బంగళాపేరు లోధ్రలాడ్జి (Lodhra Lodge) యని పెడితిని. బంగళా వీధిగేటువద్దనుండి మోటారుషెడ్డుకు 400 అడుగుల పొడవుగల రోడ్డుగలదు. (ఇంకా వుంది



# బలం గల మనిషిగా బరువు మోయకుండా భార్యతో బరువులు మోయిస్తారా ఎవరైనా?

మంచి బాధ్యతలెరిగిన వ్యక్తి తన భార్యకు అన్ని పనుల్లోనూ సహాయపడతాడు. అతడు ఆమెను అన్ని విధాలా సుఖపెట్టేందుకు ప్రయత్నిస్తాడు. కుటుంబ నియంత్రణ విషయం వచ్చినప్పుడు అతడు ట్యూబెక్టమీ ఆపరేషన్ కంటే వేసక్టమీ ఆపరేషన్ మంచిదని అర్థం చేసుకుంటాడు. ఇది ఎంత చిన్న ఆపరేషనంటే, దీన్ని అసలు ఆపరేషన్ అని అనడానికే వీలు లేదు. ఆపరేషన్‌కు



చేయండి. ఆ తర్వాత మీరు జీవితమంతా ఏ చికూ చింతా లేకుండా ఉండవచ్చు. ఇది సురక్షితమైన పద్ధతి. ఇందువల్ల అవసరంలేని గర్భాన్ని పూర్తిగా నిరోధించవచ్చు వేసక్టమీలో పురుషుడి సెక్సు గ్రంధులను అసలు ముట్టుకోరు. అతను ఇంతకు ముందు మోస్తరుగానే ఎటువంటి భయం లేకుండా మరింత ఎక్కువ సుఖాన్ని పొందవచ్చు. ఎటువంటి సమస్యలు, ఇబ్బందులు తలఎత్తవు. తన భార్యను నిజంగా ప్రేమించే వారెవరైనా—వేసక్టమీ చేయించుకునేందుకు ఎందుకు తటపటాయిస్తారు?



జ్ఞాపకముంచుకోండి
ఒక చిన్న జాగ్రత్త తీసుకోవడంవల్ల జీవిత సమస్యలను నివారించవచ్చు.

మీ కుటుంబాన్ని పరిమితం చేసుకోవడం మీ చేతుల్లోనే ఉంది.

# చందూర్ రచనలు

| | |
|---|---|
| విలువలు | పరిచయం చేసిన పుస్తకాలు |
| రాన్ని జయించిన మానవుడు | అన్యాయం |
| ్రెస్ స్టీన్‌మెజ్ | ఆఖరి కోరిక |
| నికలు | ఎక్కడికి కమలా ? |
| నమార్గం | భానుమూర్తి భార్య |
| నార్ రూజ్‌వెల్ట్ | రాధ నవ్వింది |
| పాఠాలు | కొత్త లోకాలు |
| మగాధ | కొన్ని గ్రంధాలు |
| లెన్ కెల్లర్ | సీతతో సినీమాకు |
| మేరి వెర్షిస్ | ప్రజానాయకుడు ప్రకాశం |
| - నీరు | నట్టింట దీపం |
| నగరంలో | మాంగుళూర్ మెయిల్ |
| కం | మహాబలిపురం |
| బైనా | మనకీ ఒక కారు |
| గురువారం | సీతా ఫలాలు |
| కథలు | భాష |
| | పూసల మేడ |
| క ఆరు కథలు | శివరావు |
| ాగరికత | కలడోలేడో |
| గు రోడ్లు | మావో పాలనలో |
| శక్తి | చైనాలో మైనారటీలు |
| ాజ్యం | అమెరికా |
| ం వైద్యుడు | జులై నాలుగు |
| స యాత్ర | వరదల్లో వాంగ్ |
| నా | మాతా భూమాతా |
| మానెయ్యటం | చీమలబారు |

**లో ఏ ఒక్కటీ ప్రస్తుత అచ్చులో లేవు. చదవాలను ్నవారు మీకు చేరువలోనున్న లైబ్రరీలో దొరికితే చదవండి.**

కథానిక

# తాన్యా

తాను పుట్టిన ఈ 19 ఏళ్ల ఈ మధ్య తాన్యా ఒక్కమారు కూడా వెంజా దాటి - అక్కడ ఆమె మేనత్త వుంది - పైకి వెళ్లలేదేమో. తూర్పు కెళ్లే రైల్లో కూర్చున్న ఆమెకు అన్నీ కొత్తగా, చూడదగినవిగానే అని పిస్తున్నాయి. అడవులు కప్పిన చిన్న చిన్న దక్షిణ ఉరుల్సు గుట్టల్నీ, చాలా వెడల్పుగా పారుతున్న అబ్, యెనిసీ నదుల్నీ, రైలు బాట పొడుగునా అనంతంగా వ్యాపించివున్న చిట్టడు వుల్నీ చూస్తూ, ఆమె కిటికీ వదిలి రావడంలేదు.

మాస్కోలో బయలుదేరేటప్పటికి వర్షం కురుస్తూంది. చెల్యాబంస్క్ చేరేదాకా ఆకాశం మబ్బులతో మూసుకుపోయేవుంది. తరువాత ఒక్క మారు ఆకాశం నిర్మలం అయింది. కవోష్ణ సూర్యకిరణాలు వుదయమాది సాయంకాలంవరకూ రైలు పెట్టెలో వెలుతురు నింపుతున్నాయి. అయినా, మాస్కో విడిచిన క్షణం నుంచి తాన్యా మనస్సుకి ఎలాగోవుంది. బండి తూర్పుకి వెడుతున్నకొద్దీ ఆ అశాంతి పెరుగుతూంది. తాను చూడబోతున్న అంద్రీని గురించి తనకు ఏం తెలుసు నని ప్రశ్నించుకొంది. కవిత్వం రాస్తా డనేగా! కవిత్వం రాసేవానికి వేరే సర్టిఫికెట్లు అక్కర్లేదని తాన్యా అభి ప్రాయం.

కథ ప్రారంభమయింది కవితల తోనే. గత సంవత్సరం తాన్యా వ్రాసిన కవితను ఒకదానిని 'కామ్ సోమాల్ స్కాయా ప్రావ్దా' ప్రచు రించింది. పత్రిక ద్వారానే ఆమెకు అంద్రీ ఒక వుత్తరం వ్రాసేడు. రచ యిత్రిని చూడాలనుందని అతడా వుత్తరంలో వ్రాసేడు. దానిలోనే తనని గురించి చెప్పుకున్నాడు. అతడు ఇర్కుట్స్కలో వుంటున్నాడు. 20 ఏళ్లు; మామూలు చదువు అయింది. పెద్ద చదువు కొనసాగించాలనే ప్రయ త్నంలో వున్నాడు. ఈ లోపున పాలీ క్లినిక్‌లో రిసెప్షనిస్టుగా పనిచేస్తు న్నాడు. చివరికి తానూ కవిత్వం వ్రాస్తూంటాననీ, అయితే అవి ఇంత వరకు ఎక్కడా అచ్చుకాలేదనీ వ్రాసేడు. ఆ వుత్తరానికి తాన్యా సమాధానం వ్రాసింది. అలా ఉత్తర ప్రత్యుత్తరాలు నడిచేయి. ఒకరి జీవి తాలు ఒకరికి వ్రాసుకొన్నారు. కవితలు పంపుకొన్నారు. ఈ సంవత్సరం వేసవి సెలవులకి తమ వూరు రమ్మని తాన్యాను అంద్రీ ఆహ్వానించేడు

బైకాల్ సరస్సులో ఫిషింగ్ కొండలు గుట్టలు ఎక్కడం, తైగాలో సంచారం - ఎన్నో ఆశలు చూపేడు. తాన్యాకు ఆసక్తి జనించింది. తల్లి తండ్రులు వెళ్ళొద్దన్నా వారిని కాదని బయలు దేరింది.

అయితే ఇప్పుడు తాన్యా అనుమానంలో పడింది. ఆంద్రీని ఇదివరకు ఎరగనందుకు కాదు. ఇంకో అందుకు. అతడు ఒక ఉత్తరంతో తన ఫొటో పంపిస్తూ, తనది పంపించమన్నాడు. ఫొటోలో చూస్తే ఆంద్రీ చక్కగా, ఎంతో ఉదాత్తంగా కనిపించేడు. తన ఫొటో పంపడం ఆమెకు చిన్నతనం అనిపించి, చాలా అందకత్తె అయిన తన ఫ్రెండు ఫొటో సంపాదించి ఆండ్రీకి పంపింది. ఆండ్రీ తనను గుర్తుపట్టలేడు. అతనిని తానే ముందు పలకరించాలి.

"మీరు కాదుకదా, ఆండ్రీ" - అని అడగాలి.

"నేను ఆండ్రీనే" అంటాడు, ఆశ్చర్యంగా.

"మీరు తాన్యా కోసం వచ్చేరను కొంటా" - అంటుంది తాను.

"ఔను" - అంటాడు మరింత ఆశ్చర్యంగా.

"నేనే తాన్యాను"

"మీరు ?"

ఇంతింత కళ్లుచేసి అతడు ఎంత ఆశ్చర్యంగా చూస్తాడో తాన్యా మనస్సులో వూహించుకొంది. అతని అందమైన కళ్లలో నిరాసక్త భావం, గాంభీర్యం వూహించుకొని ఆమె బాధ పడింది.

వ్లాస్కో నుంచి తన చుట్టూ వున్నవారు తనతో ఎలా వ్యవహరిస్తు న్నారో తాన్యా గమనిస్తూ వుంది. తాను సామాన్యరాలు. పెట్టెలో ప్రయాణం చేస్తున్న పడుచు వాళ్లలో ఒక్కడు కూడా తన విషయంలో ప్రత్యేక శ్రద్ధ కనబరచడంలేదు.

తాన్యాటెలిగ్రాం పంపింది ఆండ్రీకి. తాను ఏ బండిలో వస్తున్నది, అది ఏ వేళకి వచ్చేదీ, కాని తాను ఏ పెట్టెలో వుండేదీ తెలుపలేదు. మరిచి పోయింది, పెట్టె నెంబరు వ్రాయడం. స్టేషనులో దిగి, పెట్టె దింపుకొని, వచ్చినవాళ్ల ముఖాలకేసి చూడ్డం తప్ప చెయ్యగలదిలేదు. ఆండ్రీ ఎత్తుక్కూడా ఆమె ఎరగదు. పొడగరియని ఆమె వూహ.

"ఏడీ మీ ఆండ్రీ" - అంటూ బండిలో కలిసినవారు ఆమెతో ప్లాట్ ఫారమ్ మీదికి దిగి, ఒకటే ప్రశ్నలు.

"వచ్చేస్తాడు. మామూలే, ఆలస్యం చెయ్యడం" - అంది తాన్యా. పైకి పట్టనట్లు అందేకాని, లోలోపల గుండెలు పీచు పీచు మంటున్నాయి. ఫొటోలో అమ్మాయిని కాదని గ్రహించి ఆంద్రీ తనను పలకరించకుండా వెళ్ళిపోతాడేమో! అతి తెలివిగా ఫ్రెండ్ ఫొటో పంపినందుకు తనని తాను తిట్టుకుంది.

"అల్లా చూడు, అతనేమో" - అంది, రైలు పరిచియస్తురాలు, తెల్లని చొక్కా తొడిగిన ఒక కుర్రవాడిని

చూపుతూ. అతని చేతుల్లో పెద్ద పువ్వుల గుత్తి వుంది. అతడూ ఎవరినో కలుసుకొనేందుకు వచ్చి నట్లుంది. వారెవరో కనిపించివుండరు. పెట్టె నుంచి పెట్టెకు హడావిడిగా తిరుగు తున్నాడు. పరుగెత్తి, పరుగెత్తి అలసి పోయి ఓ బల్లమీద చదికిలబడ్డాడు. జుట్టంతా రేగిపోయింది. టై నలిగి పోయింది. కొద్ది సేపటికి బయలు దేరబోతూ ఇంజన్ గీ పెట్టింది.

"కంగారుపడకు తాన్యా మీ అండ్రీ రాకపోడు" అన్నారు ట్రయిన్‌ఫ్రెండ్స్.

బండి కదిలి, దూరాన అదృశ్యం అయిపోతూంటే తాన్యాని ఏదో శూన్యత ఆవరించింది. హఠాత్తుగా ఆమె కళ్లలో నీళ్లు తిరిగేయి.

ప్లాట్‌ఫారమ్ మీద ఎవ్వరూ లేరు. పువ్వుల గుత్తిపట్టుకొన్న ఆ కుర్ర వాడుతప్ప. ఏం చెయ్యాలా అని అతడు ఆలోచిస్తున్నాడు. అటువంటప్పుడే మాట్లాడ్డానికి ఎవరో ఒకరు కావాలని పిస్తుంది. తాన్యావేపు చూసేడు. ధైర్యం చేసి ఆమెతో మాట్లాడాలనుకొన్నాడు.

"తమాషాగావుంది. మనం ఇద్దరం ఒకే పరిస్థితిలో వున్నట్లుంది. నా స్నేహితురాలు వస్తానన్నది రాలేదు. మీకోసం రావలసిన మనిషి వచ్చినట్లు లేదు" - అన్నాడు.

"ఏం పర్వాలేదు. కాస్త ఆలస్యం అంతే. కాని, మీ మనిషి మరి వచ్చే ఆశకూడా లేదు" అంది తాన్యా.

"ఎవరేనా అమ్మాయి రావలసి వుందా ?" అని మళ్లీ అడిగింది.

"ఊ. మీకెలా తెలుసు ?"

తాన్యా చిన్నగా నవ్వింది. 'మిమ్మల్ని చూస్తూనే ఎవరికైనా అర్థం









సృజనాత్మక చైతన్యమూర్తి జిడ్డు కృష్ణమూర్తి

అవుతుంది - ! ఏ ఆంటీ కోసమో రాలేదని!

ఆ కుర్రవాడు తలవూపేడు చిరునవ్వుతో. అతని చిరునవ్వుచూసేక అతనిలో ఏదో మంచితనం, ఏదో ఆకర్షణ కనిపించింది, తాన్యాకు.

అతను పదడుగులువేసి, ఆగేడు. వెనక్కితిరిగి, మళ్లీ తాన్యావద్దకు వచ్చి, ఆమెతో :

"మీరు తీసుకోండి. మరి దీని అవసరం నాకు లేదు" - అన్నాడు.

ఆమె నిరాకరించలేదు. అభినందించింది. అతడు వెళ్లిపోయాడు. ఆమె ఆ ప్లాట్‌ఫారమ్ మీదనే వుండిపోయింది. ఇప్పుడామెకు నిజంగానే ఆందోళన పట్టుకొంది. ఆంద్రీ ఏమయ్యేడు? ఇంకో నిముషం చూసి, అతని యింటికే వెడదామనుకొంది. ఆ చిరునామా కంఠస్థంగానే వుంది.

చీకటి పడుతూంది. ఒకింత సేపుచూసి,

తాన్యా ఏదో హోటలుకి వెడదామనుకుంది. ఆంద్రీ ఇంటికి వెళ్లాలనిపించలేదు - హోటల్‌కెళ్లి ఆంద్రీకి ఓ ఉత్తరం వ్రాద్దామనీ. దానిలో తన ఫొటో కూడా పెట్టి పంపాలనీ అనుకొంది. పెట్టె చేతిలోకి తీసుకొంది. సరిగ్గా అదే సమయంలో ప్లాట్‌ఫారమ్ ఆ చివరన, ఆ కుర్రవాడు వస్తూ కనిపించేడు. ఆయాసపడుతూ, "మీరు వెళ్లిపోయేరని హడలిపోయా" నన్నాడు, తాన్యా నవ్వింది. "మిమ్మల్ని కలుసుకొనేందుకు ఎవరూ రాకపోతే ఏం చేస్తారు?"

"ఏదో హోటలుకి వెడతా."

"రూము వుంటుందో వుండదో. నాతో వచ్చెయ్యండి. ఈ రాత్రికి మా యింట్లో వుండండి, ఎక్కడికి వెళ్లాలో పొద్దుటే వెడుదురుగాని."

తాన్యాకు ఏం చెప్పాలో తోచలేదు. తటపటాయించింది.

"భయపడకండి - ఇంట్లో వుండేది నేనొక్కణ్ణేకాదు - మా అమ్మా, నాన్నా, చెల్లాయీ వున్నారు."

తాన్యా చిరునవ్వు నవ్వింది. అసలీ కుర్రాడు భయపడవలసిన మనిషా? అమాయకుడు.

"సరే. నడవండి. బాధ్యత మీదే. ఏం వొచ్చినా :"

"ఏమీ రాదు, రాండి" - అంటూ అతను హుషారుగా పెట్టె చేతిలోకి తీసుకున్నాడు. టాక్సీలో కూచున్నాక :

"లెనిన్ వీధి. 10వ బ్లాకు" - అని చెప్పాడతను.

తాన్యా ఆశ్చర్యపడింది. ఆంద్రీ వుండేది ఆ బ్లాకులోనే.

"మీ ప్లాటు నెంబరెంత ?" అంది ఉత్కంఠతో.

"నలభయ్యేడు"

"నిజం!"

ఆ కుర్రవాడే ఆంద్రీయని తాన్యాకిప్పుడర్థం అయింది. అవే కళ్లు, ముక్కు, నోరు, కవళిక మాత్రం కొంచెం మార్పుగావుంది. సంకోచిస్తున్న మొహం, కాని, మంచితనం కొట్టవచ్చినట్లు కనిపిస్తూంది. పైగా, అంత పొట్టిగా వుంటాడని ఆమె అనుకోలేదు.

"ఏముందీ, మీరు కలుసుకోడానికి వచ్చిన తాన్యాని నేనే"

"మీరు.... మీరా తాన్యా ?" అతను దిగ్భ్రమ చెందినట్లయ్యాడు. తాన్యా అన్నీ చెప్పింది.

ఆమె వేపు ఆశ్చర్యంగా చూస్తూ, ఆంద్రీ కొద్దిసేపు నిశ్శబ్దంగా కూర్చున్నాడు.

"ఎవరి ఫొటోనో మీరు ఎందుకు పంపాలో నాకు అర్థం కావడంలేదు. ఆ బుట్టబొమ్మకన్న మీరే చక్కగా వున్నారు"

కవి మిత్రునితో రెండు రోజులు గడిపి, మాస్కో వచ్చేసింది తాన్యా.

—వితాలి జ్లోత్నికోవ్

రామ్‌జీ భీమ్‌జీ కలిసి రైలు ప్రయాణం చేస్తూన్నారు. రైలు ఆగ్రా ప్లాట్‌ఫారంపై ఆగివుంది. రామ్‌జీ ట్రాన్సిస్టర్ ఆన్ చేశాడు. 'ఇంతవరకు మీరు విన్న వార్తలు ఢిల్లీ కేంద్రం నుంచి' అనే ముగింపు వాక్యంతో, రామ్‌జీ గబగబా సామాను సర్దుకు దిగిపోయాడు.

'ఢిల్లీ వెళ్తున్నానని ఆగ్రాలో దిగిపోయారేమిటి ?' అని ప్రశ్నించాడు భీమ్‌జీ.

'ఇప్పుడేగా రేడియోలో చెప్పారు ఢిల్లీ అని - మీరు వినలేదా ?'

'చూశారా, మీరు చెప్పాకపోతే నేను ఆగ్రా అనుకొని వుందును అంటూ భీమ్‌జీ కూడా దిగిపోయాడు.

## మనవి

మీరు విన్నవీ మీ అనుభవంలో వున్నవీ పదిమందికి చెబితే బావుంటాయనుకొనే జోక్స్, నిమ్మతొనలు శీర్షికలో ప్రచురింపబడతాయి. ఈ పత్రికకు సంబంధించిన సూచనలకు, విమర్శలకు 'పాఠకుల తీర్పు'. ప్రచురణ నిమిత్తం పంపే రచనలతోబాటు పోస్టుబిళ్లలు అతికించిన పొడుగు కవరు వుంటేకాని అంగీకారం కానివి వెనక్కి పంపడం సాధ్యం కాదు, మాఊళ్లో 'జ గ తి' దొరకడం లేదనేవారికి ఒక్కటే మనవి - చందాదారులుగా జేరమని ! రెండు సంవత్సరాలకి అంటే 24 సంచికలకు, నలభైఅయిదు రూపాయిలు.

JAGATI - Monthly, 2, Kutchery Road, P. B. 2922 - Madras-600 004

Regd No. M 6713 JAGATI RNI 1119/57 - May 90